

# భారతీయ పునరుజ్జీవనం



డి. రామలింగం



# భారతీయ పునరుజ్జీవనము

రచన

డి. రామలింగం

అంకితం :

భారతీయ పునరుజ్జీవనోద్యమం
ఆంధ్రావనికి ప్రసాదించిన
సాహిత్య పోషకుడు
కీ॥ శే॥ శివలెంక శంభుప్రసాద్ గారి
పుణ్యస్మృతికి -

ప్రచురణ :




రిజిష్టర్డ్ నెం : 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

BHARATIYA PUNARUJJIVANAM
(INDIAN RENAISSANCE)
BY D. RAMALINGAM



యువభారతి

ప్రచురణ : 61
ప్రథమ ముద్రణ :
రౌద్రి ఉగాది
17 మార్చి 1980
ప్రతులు : 1,200
ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు.
ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదరాబాద్.
ముఖచిత్ర ముద్రణ :
నందిని ఆర్ట్ ప్రింటర్స్,
హైదరాబాద్.
ప్రతులకు :
యువభారతి
5 కింగ్స్‌వే, సికిందరాబాద్ - 500 003.
లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001
వెల రూ. 6/-

---

Paper Used for the Printing of these books
was made available by
the Government of India at concessional rate.
YUVABHRATHI IS GRATEFUL

---




# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినపుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదహారేండ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి ఆనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 66 ప్రచురణలను ప్రచురించి 3 లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించటానికి పూనుకున్నది.

భారతదేశంలో ఎక్కడున్నా సరే- యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీ మిత్ర పథకంలో దాదాపు 6000 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు. యువభారతి భవిష్య నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా దాదాపు 700 మంది, భారతీ భూషణులుగా 60 మంది చేరారు.

ఉడుతా భక్తితో మేము చేస్తున్న భాషా సేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్ద్రం, భాషా ప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయన శీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ -

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు : యువభారతి

హైదరాబాద్
17-3-80

# మామాట

సహస్రాబ్దాల తపఃఫలితంగా తాను సంతరించుకొన్న సంస్కారబలంతో, ప్రజ్ఞాప్రాభావాలతో ప్రగమిస్తున్న భారతీయుడు బ్రిటిషువాడి ఆధిక్యానికి మనఃపూర్వకంగా ఎన్నడూ తలఒగ్గలేదు. పారతంత్ర్య తమస్సుల్లో చిక్కుకున్నా తన ప్రజ్ఞను మరువలేదు. పైగా చారిత్రిక కారణాలవల్ల భారదేశంలో బ్రిటిషు పరిపాలనవల్ల సంఘటిల్లిన పరిస్థితులను అవగతం చేసుకొని తనలోని స్వేచ్ఛా శక్తులను సముద్దీప్తం చేసుకోవాలని ఉద్యమించినాడు. సహృదయులైన కొందరు బ్రిటిషువారి తోడ్పాటును పొందగలిగినాడు. గ్రహణకాలంలో కోల్పోయిన కాంతిని మళ్ళీ ప్రసరించిన ఇనబింబంలాగా విజృంభించినాడు. రాజకీయ, సాంస్కృతిక, సాంఘిక, సాహిత్యక్షేత్రాల్లో కొత్త పంటలను పండించినాడు. కొత్త సిద్ధులను సాధించినాడు. అతని సాధన ఫలించింది. ఇప్పుడు స్వేచ్ఛకు ప్రతీకగా ప్రపంచంలో ప్రజ్వలిస్తున్నాడు.

దాస్యతమస్సుల్లో తాత్కాలికంగా మాటుబడిన భారతీయుడు తన ప్రతిభాలతకు మారాకు హత్తిన వైనాన్ని మిత్రులు శ్రీ డి. రామలింగంగారు ఈ పుస్తకంలో రుచిరంగా వివరించినారు. నిన్నటితరం పడినపాట్లను, సాధించిన లక్ష్యాలను నేటితరం రేఖామాత్రంగానైనా తెలుసుకోవడానికి ఈ చిన్న పుస్తకం సాయపడుతుందని మా విశ్వాసం. మరెన్నో ఉత్తమ గ్రంథాలను చదువాలనే కుతూహలాన్ని కలిగిస్తుందీ గ్రంథం.

శ్రీ డి. రామలింగం గారు కథకులు. సమీక్షకులు. పాత్రికేయులు. ఆంధ్రాంగ్లభాషా విశారదులు. చక్కని విమర్శకులు. వీటన్నింటితోపాటు సహృదయతా సంపత్తికి నిధులు. ఎంతో శ్రమతో ఈ పుస్తకాన్ని వ్రాసి మాకు ప్రచురించే అవకాశాన్ని కల్పించినందుకు శ్రీ డి. రామలింగం గారికి మా ధన్యవాదాలు.

ఈ పుస్తకానికి సముచితమైన పీఠికను సమకూర్చిన పెద్దలూ సహృదయులూ సాహితీప్రియంభావుకులూ మా యువభారతి గౌరవసభ్యులూ శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికి మా అభివందనములు.

సహృదయులైన భాషాభిమానులు మేము నిర్వహిస్తున్న భాషోద్యమానికి ప్రోత్సాహాన్ని అందిస్తుంటారని అకాంక్షిస్తున్నాను.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు

# నివేదనం

ఇది ప్రధానంగా చరిత్ర గ్రంథం. అయితే దీనిలో చరిత్ర మాత్రమే లేదు; మన సంస్కృతి, నాగరికత, ఆధునిక కాలంలో వచ్చిన ఉద్యమాలు, కలిగిన పరిణామాలు మొదలగు అనేకాంశములు ఇందులో ఉన్నాయి. మానవుని చరిత్రలో యూరపు పునరుజ్జీవనం ఒక మహోజ్జ్వల అధ్యాయం. పునరుజ్జీవనం (Renaissance) అనేమాట అక్కడే పుట్టి ప్రపంచమంతటా వాడుకలోకి వచ్చింది. ఆ ఒక్క మాటలో ఆధునిక మానవ నాగరికత అంతా ఇమిడి ఉంది. యూరపు పునరుజ్జీవనమంతటి ప్రతిభా సమన్వితమైనది కాకపోయినా భారతీయ పునరుజ్జీవనం అల్పమైనదేమీ కాదు. పై పెచ్చు ఎంతో మహత్వము కలది. యూరపులో కొన్ని శతాబ్దాల కృషివల్ల సాధ్యమైన గొప్ప ఫలితాలు భారత దేశంలో ఒక్క శతాబ్దిలో సిద్ధింప జేసుకోబడ్డవి. ఒక్క 19వ శతాబ్దిలో వివిధ రంగాలలో ఎందరు మహనీయులు జన్మించారు! ఎటువంటి ప్రజ్ఞా ప్రాభవాలు కనపరిచారు!! లోకోత్తర పురుషుడైన మహాత్మా గాంధీ జన్మించిన యుగమిది. కాబట్టి భారతీయ పునరుజ్జీవనం ఇంచుమించు యూరపు పునరుజ్జీవనమంత మహిమోపేతమైనదని నా నిశ్చితాభిప్రాయం. రాజా రామమోహనరాయ్ ఆవిర్భవించక పూర్వం భారతదేశ స్థితిని గుర్తుకు తెచ్చుకున్నా, కందుకూరి వీరేశలింగం పంతులుగారు రంగంపైకి రాకపూర్వం ఆంధ్రదేశ పరిస్థితిని తలచుకున్నా, వారిద్దరి తరువాత భారతదేశంలోనూ, ఆంధ్రావనిలోనూ వచ్చిన మహా పరిణామం చరిత్ర గతినే మార్చివేసి ఈ మహా జాతికొక కొత్త తెన్నును చూపి ఈ దేశాన్ని వర్థమాన దేశాల సరసన నిలిపిందని మనకు విశదమవుతుంది. విశిష్టమైన రెండు గొప్ప నాగరికతల సమ్మేళనం వల్ల ఈ పరివర్తనం సాధ్యమైంది. ఇట్టి అపూర్వ పరివర్తనం ఎట్లా సంభవించిందీ, దీని లక్షణాలేమిటీ, దీనివల్ల కలిగిన సత్ఫలితాలేమిటీ, మనం సాధించిన విశేషమేమిటీ అన్న అంశాలను వివేచన చేయడం ఈ చిన్న పుస్తకం ముఖ్యలక్ష్యం. గ్రంథ విస్తృతి విషయంలో కొన్ని పరిమితులుండడం వల్ల ఇది సమగ్ర పరిశీలనం కాజాలక పోయిందన్న యథార్థాన్ని నేను ఎరుగుదును. అయినా భారతీయ పునరుజ్జీవనమును గూర్చిన భావన, సమాలోచన దీనిలో వచ్చాయనుకుంటాను.

ఈ పుస్తకం నేను వ్రాయడానికి ముఖ్య కారకులు యువభారతి అధ్యక్షులు డా. ఇరివెంటి కృష్ణమూర్తిగారు. ఆయన ప్రోత్సాహమే లేకపోతే ఇది ఈ రూపంలో వచ్చేది కాదేమో! ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి రెండు దశాబ్దాలు ప్రధాన కార్యదర్శిగా పనిచేసి, సాహితీ పరులకూ, సాహిత్య సంస్థలకూ పట్టుగొమ్మ అయిన శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు ఈ పుస్తకానికి నేను అడిగినంతనే తొలిపలుకు వ్రాయడం నాకెంతో ఆనందం కలిగించింది. వారి మార్గదర్శకత్వాన మేమంతా మాకు చేతనైన భాషా సేవ చేశాము. వారు 1962 లోనే 'తెలుగు సీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము' అనే గ్రంథం రచించి ఉన్నారు. బహుశా ఈ విషయంపై తెలుగులో అదే మొదటి గ్రంథమనుకుంటాను. అది ఇప్పటికి అయిదు ముద్రణలు పొందిన ఉత్తమ గ్రంథము. నా ఈ పుస్తకానికి పీఠిక వ్రాయడానికి వారే తగినవారని నేను భావించి వారిని కోరినంతనే అందుకు వారంగీకరించి తమ అమూల్యాభిప్రాయం వ్రాసినందుకు వారికి నా కృతజ్ఞతాభివందనము లర్పించుకొంటున్నాను. ఆలోచనా పరులైన ఆంధ్ర పాఠకులు నా కృషిని ఆదరిస్తారని ఆశిస్తాను.

హైదరాబాదు.
సెప్టెంబరు 1979

డి. రామలింగం.

# తొలిపలుకులు

భారతదేశ చరిత్రలో ౧౯వ శతాబ్దం మిక్కిలి ముఖ్యమైనది. ఈ శతాబ్దం లోనే భారత భూమి మీద మొగలాయి రాజ్యం అంతమొంది ఫ్రాన్స్, పోర్చుగల్, ఇంగ్లండ్ రాజ్యాలు అడుగుపెట్టి తమ సార్వభౌమాధికారాన్ని స్థాపించి స్థిరపరచుకోవలెనన్న ఉద్దేశంతో పోటీపడి యీ పోటీలో ఇంగ్లండ్ సంపూర్ణ విజయం సాధించింది. ఆంగ్లరాజ్యస్థాపన సుస్థిరమైన తర్వాత మన దేశంలో కొంతమంచి, కొంత చెడ్డ రెండూ జరిగినవి. ౧౮౭౫ ప్రాంతంలోని మన దేశ పరిస్థితులను సమీక్షించిన అరవిందయోగి యీ పరిస్థితుల కాలాన్ని 'మహాక్షయ'మని వర్ణించినాడు. ఇటువంటి స్థితిలో దేశమంతా ఒక పరిపాలన క్రిందికి వచ్చి ఆంగ్ల విద్యావ్యాప్తి జరిగి కొద్దిసంఖ్యగల విద్యాధిక వర్గాలలో ఒక నూతన వికాసము గోచరించినది. దేశంలో ఒకరకమైన శాంతి భద్రతలు ఏర్పడినవి. ముఖ్యంగా పట్టణాలలోని ప్రజాజీవితాన్ని ఆంగ్లనాగరికత ప్రభావితం చేసింది. ఈ విధంగా ఆంగ్లవిద్యతోపాటు పాశ్చాత్య నాగరికత, ఆధునిక విజ్ఞానం మనదేశంలో అడుగు పెట్టినవి.

ఈ పరిస్థితి పునరుజ్జీవనంగా వర్ణితమైనది; యిందులో సత్యం లేకపోలేదు. పల్లెపట్టులు, సాధారణ ప్రజలు, వారి ఆర్థిక పరిస్థితి, దేశీయ పరిశ్రమలు, వ్యవసాయం, ప్రాచ్యవిజ్ఞానం ఆంగ్ల పరిపాలనా ఫలితంగా దిగజారిపోయినప్పటికిని దేశమంతా ఒక ఏలుబడికింద ఉండినందువలన, పట్టణాలలో శాంతి భద్రతలు స్థిరపడినందువలన, రాకపోకల సౌకర్యాలు సక్రమంగా ఏర్పడినందువలన, ఆంగ్ల విద్యాధికవర్గం ఒకటి రూపొందినందువలన, దేశంలో ఒక విధమైన వెలుతురు కనిపించింది. ఈ వెలుతురులో జాతికి మార్గదర్శకులైనవారు అన్ని రంగాలలో ఉద్భవించినారు. ఒకవైపున పాశ్చాత్యనాగరికత ప్రబలుతుండగా దేశభాషలను సంస్కృతిని పాశ్చాత్య సాహిత్య సంస్కృతులు ప్రభావితం చేయగా మరొక వైపున భారతదేశంలో జాతీయ భావాలు వ్యాప్తిచెంది, దేశాభిమానం విస్తరించి స్వాతంత్ర్యోద్యమము బలపడింది. కొన్ని శతాబ్దాలక్రింద యూరప్‌లో వచ్చిన పునరుజ్జీవనంవంటిదే భారతదేశంలోను కనిపించింది. రాజా రామ్‌మోహన్‌రాయ్, ఈశ్వర్‌చంద్ర విద్యాసాగర్, కందుకూరి వీరేశలింగం పంతులు మొదలైనవారు విద్యావ్యాప్తికి, సంఘసంస్కరణకు కృషి చేయగా,దయానంద సరస్వతి, వివేకానందుడు, దాదాభాయి నౌరోజి, బాలగంగాధర తిలక్, మహాత్మా గాంధీ భారతజాతీయతకు ప్రాతినిధ్యం వహించి ప్రజలలో జాగృతిని కలిగించిరి. ఇదంతా ఒక మహోజ్జ్వలమైన చరిత్ర. ఈ మహనీయుల కృషి ఫలితంగా సాంస్కృతిక రంగంలో నూతన చైతన్యం ఉద్భవించినది. స్వాతంత్ర సాధన కృషిసాగినది. ఈ నూతనచైతన్యంనే పునరుజ్జీవనంగా పేర్కొనవచ్చును. ఈ పునరుజ్జీవన ప్రారంభవికాస పరిణామాలు యీ గ్రంథములో చక్కగా వర్ణితమైనవి. ఈ గ్రంథం సకాలంలో వచ్చినదనే చెప్పవచ్చును. ఈ రచన వెనుక బహుగ్రంధావ

లోకంతోపాటు సమగ్ర విషయ సేకరణ కనిపిస్తున్నది. ఇందులో పేర్కొన్న సంగతులు గ్రంథస్థము కావలసిన అవసరమున్నది.ఆ అవసరాన్ని యీ పుస్తకము చక్కగా తీరుస్తున్నది.

గ్రంథకర్త శ్రీ డి. రామలింగంగారు తెలుగు పాఠకలోకానికి సుపరిచితులు. పత్రికారచనతో ప్రారంభించి, ప్రభుత్వోద్యోగంలో అడుగుపెట్టి కొంత కాలం పనిచేసి బహుముఖమైన అనుభవం సంపాదించిన ఆంధ్రాంగ్ల భాషా ప్రవీణులు; ఈ రెండు భాషలలోను రచన చేయగలిగిన కొద్దిమందిలో చెప్పదగిన వారు; సమీక్ష, సాహిత్య విమర్శలో అందవేసినచేయి. సుమారు ३౪,३౫ సంవత్సరాల అనుభవం రామలింగంగారికి సాంస్కృతిక రంగంలో ఉన్నది. ఆధునిక వాఙ్మయాన్ని, నవీన సంస్కృతిని కూలంకషంగా పరిశీలించి, యిప్పటి వరకు వారు అనేక రచనలు గావించినారు. పరిపక్వమైన అనుభవంతో, కావలసిన విషయ సేకరణతో యీ గ్రంథాన్ని రచించి తెలుగు భాషను సంపన్నము గావించినారు. తాము తెలిపిన సంగతులకు ఆధారంగా, వారు యింతకుముందు ప్రామాణికులైన విజ్ఞానులు వెల్లడిచేసిన అభిప్రాయాలు ఉదహరించినారు. అందుచేత యీ గ్రంథానికి ప్రత్యేకమైన విలువ కలుగుతున్నది.

యువభారతి యీ గ్రంథాన్ని ప్రచురించి సాంస్కృతిరంగానికి మహోపకారం గావించినది. మన రాష్ట్రంలో, విశేషించి మన రాజధాని నగరంలో సుమారు ౧౫ సంవత్సరాలనుండి యువభారతి చేస్తున్న కృషి సాహిత్యాభిమానులకు, సంస్కృతీ ప్రియులకు బాగా తెలిసిన సత్యం. యువతీ యువకులను సాహిత్య సంస్కృతులవైపు అభిముఖం చేయడంలో యువభారతి కృషి ప్రశంసనీయము. పెద్దయెత్తున సమావేశాలు జరిపి, చర్చావేదికలను నిర్వహించి, ఉత్తమ గ్రంథాలను ప్రకటించి, యువభారతి ప్రగతి మార్గంలో పురోగమిస్తున్నది.

డి. రామలింగంగారు రచించిన యీ గ్రంథాన్ని యువభారతి ప్రకటించినందుకు ప్రకాశకులకు, గ్రంథకర్తకు ఉభయులకు నా అభినందనలు. ఈ గ్రంథానికి సుస్వాగతం. ఇంతకుముందు యువభారతి ప్రచురణలను ఆదరించిన తెలుగు పాఠకలోకం యీ గ్రంథాన్ని కూడా నిస్సందేహంగా ఆదరించగలదని విశ్వసిస్తున్నాను. అనుభవం, విజ్ఞానం, రచనాశక్తి మూడూ ఉండి ప్రస్తుతము తగినంత తీరిక ఉన్న శ్రీ రామలింగంగారు యింకను ఎన్నియో యిటువంటి రచనలు కావించగలరని ఆశిస్తున్నాను.

హైదరాబాదు — దేవులపల్లి రామానుజరావు

౬-३-౧౯౮౦

# 1. ఆవిర్భావం

ఒక మహానాగరికతకు ఆలవాలమైన భారతదేశం ఆధునిక చరిత్రలో ఒకదశలో స్తబ్ధమై తన పూర్వపు తేజస్సును కోల్పోయింది. 1757లో జరిగిన ప్లాసీయుద్ధంలో బ్రిటిషువారు బెంగాలును జయించడమే భారత పతనానికి నాంది. ఆ సంవత్సరమే భారతదేశంలో బ్రిటిషుసామ్రాజ్యానికి పునాదులు ఏర్పడ్డాయని చరిత్ర పరిశీలకుల అభిప్రాయం. బహు ప్రాచీనమైన ఈ దేశం ఎంత చరిత్రను చూచింది! ఎన్ని దండయాత్రలకు గురి అయింది! ఎంత రక్తం ఈ నేలలో పారింది! ఎన్ని రాజవంశాలు పాలించాయి! ఎన్ని చారిత్రక దశలు, ఎన్ని వృద్ధి క్షయాలు, ఎన్ని ఉత్థాన పతనాలు! ఎన్ని సంస్కృతులు వచ్చి ఈ మహా నాగరికతలో లీనమయ్యాయి! అయినా ఈ నాగరికత అవిచ్ఛిన్నంగా కొనసాగింది.

కాని 18వ శతాబ్దిలో ఈ దేశం ఎంతటి క్షీణదశకు వచ్చిందో తలచుకుంటే నిర్విణ్ణులమవుతాము. భారత చరిత్రలో అది అంధయుగం. పాత సమాజం, పాత పాలనావ్యవస్థ ఛిన్నాభిన్నమయ్యాయి. ఒక ప్రాచీన సాంఘిక వ్యవస్థ బీటలిచ్చింది. దానిని కట్టు దిట్టం చేసేవారే లేకపోయారు. నిర్జీవమైన సంప్రదాయాలు, నేలలో కూరుకుపోయి శిలారూపందాల్చిన ఆచారాలు, అర్థం పర్థంలేని ఆనవాయితీలు జాతి జీవనస్రవంతిని ఇంకిపోయేటట్టు చేశాయి. మధ్యయుగాల ఫ్యూడల్ రాజరికవ్యవస్థ దేశంలో రాజకీయంగా అరాజకం తెచ్చిపెట్టి యూరపు ఖండవాసులు సాహసించి ఈ దేశంపై పడే అవకాశాన్ని కల్పించింది. విద్యా విజ్ఞానాలు పోగొట్టుకున్నాము. మత, తాత్త్విక, వైజ్ఞానిక, కళారంగాలలో సృజనాత్మకప్రజ్ఞ మృగ్యమైపోయింది. బుద్ధి వివేకములు క్షీణించాయి. పాండిత్యము తరిగిపోయిండి. ఉత్తేజం, ఉత్సాహం, దూరదృష్టి, భావనాశక్తి, కాల్పనిక సృష్టి లుప్తమై పోయాయి. ఈ స్థితిని అరవిందమహర్షి (1872-1950) ''మహాక్షయము'' (Great Decay) అని అభివర్ణించాడు. ఈ పరిస్థితిని గూర్చి వ్రాస్తూ విఖ్యాత చరిత్రకారుడు కె. ఎం. పణిక్కర్ ''భారత దేశంలో విశాల భూభాగాలలో 18వ శతాబ్ది ద్వితీయార్ధంలో నాగరికతయే నిలిచి

పోయినట్లనిపించింది. అట్టి పరిస్థితి ప్రపంచంలో మరెక్కడా కన్పించదు. బెంగాలులో, గంగానది లోయలో అరాజకం ప్రబలింది. 18వ శతాబ్ది ముగియ వచ్చేసరికి జనాభా అధికంగా ఉన్న ప్రాంతాలలో, సాంప్రదాయికంగా సంస్కృతికి నిలయాలైన ప్రదేశాలలో భారతదేశం సాగిలబడిపోయి ఎగఊపిరి పీల్వ నారంభించింది. మతం హీనస్థాయికి చేరుకొని నైతికంగా దిగజారిపోయింది. భారతదేశ ఆత్మయే గాఢమైన నిరాశావాదంలో మునిగిపోయింది'' అన్నారు.*

జవహరలాలు నెహ్రూ (1889-1964) తన 'డిస్కవరీ ఆఫ్ ఇండియా' అనే గ్రంథంలో ఈ విషయాన్ని ప్రస్తావించి, భారతదేశ బలాన్ని గూర్చి, బలహీనతలను గూర్చి చర్చిస్తూ ''ఆ క్షీణదశకు కారణాలు స్పష్టంగా కనిపిస్తూనే ఉన్నాయి. సాంకేతిక పురోగమనంలో భారతదేశం వెనుకబడిపోయింది. అనేక విషయాలలో అంతవరకూ మనకన్నా వెనుకబడి ఉన్న యూరపు ఖండం సాంకేతికంగా ముందంజ వేసింది. వారి పురోగమనానికి సైన్సుపట్ల గాఢానురక్తి, జీవితమంటే పొంగిపొరలే అమితోత్సాహం, చొరవ, ధైర్యసాహసాలు ప్రాతిపదికలు. వారు బహుముఖంగా కృషి సల్పి అనేక కార్యకలాపాలు ఆరంభించారు. సాహసించి సముద్రాలు దాటి కొత్త సీమలు కనుగొన్నారు. నూతన సాంకేతిక పద్ధతులవల్ల సైనికశక్తి సమకూరింది. నలుదిశలా వ్యాపించి ప్రాచ్యదేశాలపై ప్రాబల్యం సంపాదించగలిగారు. ఇది ఒక్క భారతదేశ కథ మాత్రమే కాదు. దాదాపు ఆసియా అంతటా ఇదే జరిగింది'' అన్నాడు. భారత రాజకీయ నాయకులలో జవహరలాలు చారిత్రక పరిజ్ఞానంలో, విశాల శాస్త్రీయ దృక్పథంలో అసమానుడు.

విజ్ఞానం, వివేకం, సంస్కృతి, నాగరికతలకు పెట్టినపేరైన భారతదేశంలో ఇది ఇట్లా ఎందుకు జరిగింది అన్న అన్వేషణ కూడా కష్టతరమైనదే నని నెహ్రూయే అన్నాడు.

ఈ స్థితిలో భారతదేశానికి పునః జాగృతి అవసరమైంది. అది సహజంగానే వచ్చింది. ఈ విషయమై 1918 లో దివ్యజ్ఞాన సమాజానికి చెందిన జేమ్సు హెచ్. కజిన్స్ 'రినైజాన్స్ ఇన్ ఇండియా' అనే గ్రంథం

---

* *'ఎ సర్వే ఆఫ్ ఇండియన్ హిస్టరీ'—కె. ఎం. పణిక్కర్, ది నేషనల్ ఇన్‌ఫర్మేషన్ అండ్ పబ్లికేషన్సు లిమిటెడ్, బొంబాయి, 1947.*

వ్రాశాడు. అందులో ఆయన భారతదేశం ఎప్పుడూ మేల్కొనే ఉన్నదనీ, కాబట్టి దానికి జాగృతి అవసరమే లేదనీ, భారతీయ సంస్కృతికి నిర్జీవత్వము, వినాశము అనేవి లేవనీ, కొన్నివేల సంవత్సరాల క్రిందట అది ఎట్లా ఉన్నదో ఇప్పుడూ అట్లే ఉన్నదనీ వ్రాశాడు. అయితే భారత చిత్రకళా రంగంలో వచ్చిన మహోజ్జ్వల వంగ సంప్రదాయం భారత పునరుజ్జీవనాన్ని సూచిస్తున్నదని కజిన్స్ అంగీకరించాడు. ఈ గ్రంథాన్ని చదివిన అరవిందుడు ''ఆర్య'' పత్రికలో ఈ విషయంపై తన వ్యాసాలు ప్రకటించాడు. అవి తరువాత ఒక పుస్తకంగా కూడా వచ్చాయి.* ఈ దేశానికి అప్పుడు వచ్చిన క్షీణదశ దృష్ట్యా చూచినా, భారతీయ కాలచక్రాన్నిబట్టి చూచినా, యుగధర్మాన్నిబట్టి అయినా పునరుజ్జీవనం అవసరమేనని అరవిందుడు అన్నాడు. అయితే అరవిందునిది ఆధ్యాత్మిక దృష్టి. సంభవించిన పతనానికి మూలకారణం ఆధ్యాత్మిక ప్రేరణ నీరసించడమేనని ఆయన అభిప్రాయం. పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రాన్నీ, హేతువాదాన్నీ, అభ్యుదయ తత్త్వాన్నీ స్వీకరించవలసిందేనని చెబుతూ, మన భారతీయ జీవన విధానాన్ని అనుసరించి, మన ఆధ్యాత్మిక ఆదర్శాలకు అనుగుణంగా వాటిని గ్రహించవలసి ఉంటుందని అరవిందుడు అన్నాడు. దివ్య జీవనాన్ని దర్శించిన మహర్షి ఆయన. అతీత మానసిక శక్తిని పొందగలిగిన మహాయోగి.

యుగ ధర్మాన్ని అనుసరించి, చారిత్రక ప్రభావాలను బట్టి మానవుని సృజనాత్మక కృషి జరుగుతుంది. 19 వ శతాబ్ది ఆరంభంలో పాశ్చాత్య సంపర్కంతో ఎన్నో ప్రభావాలు భారతదేశంపై ప్రసరించాయి. అన్నిటికన్న ముఖ్యమైనది విజ్ఞానశాస్త్ర ప్రాబల్యం. ఆ స్థితిలో సమన్వయం, సంధానాత్మక సంలీనం అవసరమయ్యాయి. పాశ్చాత్య ప్రపంచంతో భారతదేశంసమన్వయాన్ని పొందింది. దాని ఫలితమే ఆధునిక కాలంలో భారత పునరుజ్జీవనం. మధ్య యుగాలలో పశ్చిమ యూరపు తన నిద్రావస్థనుండి మేల్కొని నూతన భావాల కోసం, వినూతన రీతులకోసం గ్రీసు, రోముల సాహిత్యాలవైపు మరలినట్లే భారతదేశం పాశ్చాత్య సంపర్కమువల్ల కలిగిన జాగృతితో ప్రగతిపథాన పయనించింది. రెండు నాగరికతల సంపర్కమువల్ల ఆధునిక కాలంలో భారత పునరుజ్జీవనోద్యమ ఆవిర్భావం జరిగింది.

---

*'ది రినైజాన్స్ ఇన్ ఇండియా', శ్రీఅరవిందాశ్రమం, పాండిచేరి, 1920.

# 2. యూరపు పునరుజ్జీవనం

19 వ శతాబ్దిలో ఆరంభమైన భారతీయ పునరుజ్జీవనోద్యమం అనేక విషయాలలో యూరపులో 13, 14, 15, 16 శతాబ్దాలలో వచ్చిన పునరుజ్జీవనాన్ని పోలి ఉన్నది. అయితే వలసపాలన దశలో వచ్చినది కాబట్టి భారత పునరుజ్జీవనోద్యమం యూరపు ఉద్యమం వలె సార్వజనీనం, విశ్వవ్యాప్తం కాలేకపోయింది. దేశ కాల పరిస్థితులనుబట్టి మనది స్థానికమూ, ప్రకృతమూ అయింది. నూత్న విద్యావిధానం, ఆధునిక దృష్టి, సంఘ సంస్కరణలు, జాతీయతాభావ ప్రజ్వలనం, స్వాతంత్ర్య సాధన, నవ సృజన—వీటికి మనం ప్రాముఖ్య మిచ్చాము. ఏమైనా రెండు ఉద్యమాల లక్ష్యం ఒకటే: నవీనదృష్టి, పునరుద్ధరణ, పురోగమనం. కనుక మొదట యూరపు పునరుజ్జీవనోద్యమాన్ని గూర్చి తెలుసుకోవడం అవసరం.

యూరపులో వచ్చిన పునరుజ్జీవనోద్యమాన్ని చరిత్రకారులు 'రినైశాన్స్' (Renaissance) అని వ్యవహరిస్తున్నారు. అంటే కొత్తపుట్టుక అని అర్థం. ఈ మాట మానవ సమాజం ఒక చారిత్రక దశనుంచి మరొక దశకు పరివర్తనం చెందడాన్ని సూచిస్తుంది. అదొక పరిణామం. సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక, కళారంగాలలో గొప్పమార్పు రావడం దాని సహజ లక్షణం.

ఈ రినైశాన్స్‌కు జన్మస్థానం ఇటలీ అని చెప్పవచ్చు. అక్కడ ఇది 13 వ శతాబ్దిలోనే మొలకెత్తింది. డాంటే మహాకవి (1265–1321) ఇటాలియన్ భాషలో రచించిన 'డివైన్ కామెడీ' అనే కావ్యంలో రినైశాన్స్ లక్షణాలైన భావ స్వాతంత్ర్యం, విమర్శనాత్మక ధోరణి కన్పిస్తాయి. మానవులు ధర్మమార్గాన్ని వీడి అన్యమార్గాలలో పయనిస్తున్నారని అతడు హెచ్చరించాడు. పెట్రార్క్ (1304-1374) తన కాలంనాటి సమాజంలోని లోపాలనూ, అప్పటి విద్యాపాండిత్యాలనూ విమర్శించడమేగాక, గ్రీకు లాటిన్ వ్రాతప్రతులను సేకరించి ప్రాచీన రోమన్ కట్టడాల పట్ల ప్రజలకు ఆసక్తి, గౌరవభావం

కలుగజేశాడు. అట్లే బొకేషియో (1313–1375) తన కాలపు ప్రజలకు ప్రాచీన సాహిత్యం పట్ల, కళలయెడ శ్రద్ధాసక్తులు కలిగించాడు.

ఇట్లా ఉండగా ఎన్నో శతాబ్దాలనుండి గ్రీకు, రోమన్ పండితులకు కేంద్రంగా ఉంటూ వచ్చిన తూర్పు రోమన్ రాజధాని కాన్‌స్టాంటినోపుల్‌పై తురుష్కులు 1453 లో దాడిచేసి దానిని వశపరచుకోగా, విజేతలైన తురుష్కులు తమనూ, తమ కావ్యాలనూ, పాండిత్యాన్నీ ధ్వంసం చేస్తారని భయపడి గ్రీకు విద్వాంసులు పరదేశాల పాలైనారు. ఇటలీ ఆ రోజులలో రోమ్, ఫ్లారెన్స్, మిలాన్, వెనీస్, నేపిల్స్ అను స్వతంత్ర రాజ్యాలుగా విభజితమై ఉంది. వాటిని బలవంతులైన సంపన్న కుటుంబాలవారు పాలిస్తూ ఉండేవారు. ఇటలీ ప్రజలు ప్రాచీనసాహిత్యంపట్ల, కళల పట్ల ఆసక్తిని చూపడంవల్ల ప్రాచీన గ్రీకు రోమన్ కళాసాహిత్యాల అధ్యయనం తిరిగి పెంపుజెందనారంభించింది. యూరపులో మధ్యయుగాలలో మత గురువులు, చర్చి అధికారులే పండితులూ పరిశోధకులూ! విజ్ఞానరంగమంతా వారి యేలుబడిలో ఉండవలసిందే. వారు చెప్పిన సూక్తికి తిరుగులేదు. వారెంతకూ చెప్పేవి మత ధర్మ సూత్రాలే. అందువల్ల ప్రజలు పరలోకచింతనకు ప్రాముఖ్య మిచ్చేవారు. వారి విజ్ఞానమంతా మతానికీ,సనాతనత్వానికీ, ఆధ్యాత్మికతకూ సంబంధించి ఉండేది. అది స్వతంత్ర బుద్ధి కలవారు సహింపరాని విధంగా ఉండేది. పుస్తకాలలో వ్రాసిఉన్న దానినీ, మత గురువులు చెప్పిన దానినీ సామాన్యులు గుడ్డిగా నమ్మేవారు. జీవిత యధార్థాలతో వారికి నిమిత్తం లేదు.ఇక పునః పరిశీలనకూ,విమర్శకూ అసలు తావే లేదు.అంటే వారిది మతగురువుల కట్టడులకు లోబడిన ఎదుగూ బొదుగూలేని విద్య. కాని గ్రీకుల పాండిత్యానికీ,సాహిత్యానికీ ఒక విశిష్టత ఉన్నది.వారు మానవ జీవితానికీ ప్రకృతికీ ప్రధానస్థాన మిస్తారు.ప్రత్యక్ష ప్రమాణము లేనిదే దేనినీ నమ్మరు.విజ్ఞానశాస్త్రం, చరిత్ర, గణితము, ఖగోళశాస్త్రం వంటి విషయాలనుగూర్చి వారు అనేక గ్రంథాలు రచించారు. వారిలో మానవతాదృక్పథం ఉండేది. వారి ప్రభావం క్రమంగా విశ్వవిద్యాలయాలకు ప్రాకింది. రినైశాన్స్ మేధావులు నూతన సత్యాలు కనుగొన్నారు. పాత విశ్వాసాలనూ ఆచరణలనూ ఖండించారు. కొత్త పద్ధతులు ప్రవేశపెట్టారు. ఈ విషయాన్ని గూర్చి స్వామి వివేకానందుడు (1863-1902)

'ది ఈస్ట్ అండ్ ది వెస్ట్'* అనే గ్రంథంలో "ప్రాచీన గ్రీసు దేశపు వివేకము, పాండిత్యము, కళలు ఇటలీ దేశమును ప్రవేశించి అచ్చటి అనాగరక జన ప్రాబల్యము నణచి పుచ్చి, తమ ఉజ్జీవన ప్రభావమును అందు చొప్పించుటచే విశ్వరాజధానియగు రోమునగరము యొక్క మృతశరీరము మరల జీవనముతో స్పందింపసాగెను. ఈ నూత్న జీవిత స్పందనము ఫ్లారెన్స్ నగరమందు ప్రబలమును, అప్రతిహతమును అగు ఆకృతిని దాల్చి విజృంభించుటచే ప్రాతపడ్డ ఇటలీ దేశము నూతన జీవన చిహ్నములను చూపనారంభించెను. దీనినే రినేశాన్స్ (Renaissance) అందురు" అని వ్రాశాడు. ముద్రణాయంత్రము, దిక్సూచి, తుపాకిమందు రావడంతో రినేశాన్స్ వ్యాప్తికి దోహదం కలిగింది.

రినేశాన్స్ ఉద్యమం ఇటలీలో 15, 16 శతాబ్దాలలో మహోన్నత స్థితికి రావడానికి కొన్ని కారణాలున్నాయి. ఆ ఉద్యమం ముఖ్యంగా నగరాలలో పెంపు గాంచింది. ఉత్తర ఇటలీలోని వెనీస్, ఫ్లారెన్స్ నగరాలు సంపన్నులకు నిలయములవడంచేత అవి దానిని వర్ధిల్లజేశాయి. గొప్ప కట్టడాలకూ, వర్ణ చిత్రాలకూ ధనము, ప్రోత్సాహము కావాలి కదా! పైగా ఇటలీలోనే ప్రాచీన రోమన్ సామ్రాజ్యపు గొప్ప కట్టడాలు ఉన్నాయి. రినేశాన్స్ స్వర్ణయుగంలో లియొనార్డోదావించి (1452-1519), రాఫేల్ (1483-1520), మైకేల్ ఎంజెలో (1475-1564) లోకోత్తర కళాకారులు. వారు సృష్టించిన కళాఖండాలు నభూతో నభవిష్యతి. మానవుని సృజనశక్తి, మానవనాగరికత పరాకాష్ఠ చెందడాన్ని అవి సూచిస్తాయి. లియొనార్డో, మైకేల్ ఏంజెలో వర్ణచిత్ర రచనలో, శిల్పంలో విప్లవాత్మకమైన భావాలను ప్రవేశపెట్టారు. వారే రినైశాన్స్‌కూ, దాని మహోజ్జ్వల ప్రకాశానికీ కర్తలు. వీరిద్దరూ అంతకుముందే ఇటలీలో ఆరంభమైన మానవతావాదాన్ని తమ కృతులద్వారా ముందుకు గొనిపోయారు.

రినైశాన్స్ ఉద్యమం ఇటలీనుంచి ఫ్రాన్సు, స్పెయిన్, జర్మనీ, ఇంగ్లాండు దేశాలకూ, తక్కిన యూరపుకూ విస్తరించింది. 'ఆక్స్‌ఫర్డు రిఫార్మర్స్' అనే

---

*దీని బెంగాలీ మూలం 'ప్రాచ్య ఓ పాశ్చాత్య'-తెలుగు అనువాదము: కంచుకూరు మల్లికార్జునం, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు.*

పేరుగల ఒక పండితవర్గంవారు సంఘంలోని చెడుగులనూ, మత దురాచారాలనూ వ్రేలెత్తి చూపుతూ, సమాజాన్నీ మతాన్నీ సంస్కరించవలసిన ఆవశ్యకతను గూర్చి ప్రజలకు చెబుతూ ఉండేవారు. వీరిలో జాన్ కోలెట్ ఇరాస్మస్, సర్ థామస్ మోర్ ముఖ్యులు. మోర్ ఆంగ్లేయుడు. అద్భుతమైన సృజనాత్మక ప్రతిభకలవాడు. అతడు లాటిన్ భాషలో రచించిన 'యుటోపియా' (Utopia) అనే గ్రంథం ఆంగ్ల పునరుజ్జీవనానికి నాందీ ప్రస్తావన చేసింది. అది పాత భావాలనూ, సిద్ధాంతాలనూ గర్హించింది. భావనాస్రవంతి విషయంలో కొత్త మలుపును తెచ్చిన ఈ గ్రంథం ప్రత్యేకంగా పండితులకోసమే లాటిన్ భాషలో వ్రాయబడింది. దానిని వ్రాసినప్పుడు మోర్ వయస్సు 38 సంవత్సరాలట! మానవ ప్రకృతియొక్క మంచితనం విషయంలో విశ్వాసం ప్రకటించిన ఈ గ్రంథం 1551లో ఆంగ్లంలోకి అనువదింపబడింది. ప్రపంచ ప్రసిద్ధ నాటకకర్త అయిన షేక్స్పియర్ (1564-1616) రచించిన నాటక సాహిత్య మంతటా మానవతావాదమే గోచరిస్తుంది.

ఇంగ్లాండులో వచ్చిన రినైశాన్స్ మతోద్ధరణమునకు (Reformation) దారి తీసింది. యూరపులో 16వ శతాబ్దిలో మత విషయకంగా వచ్చిన గొప్ప విప్లవం రిఫార్మేషన్. విద్యావంతులలో విమర్శనాత్మకబుద్ధి ప్రబలినది. సంప్రదాయాలు ఖండనకు గురి అయినవి. బైబిలు జాతీయ భాషలలోకి అనువదింపబడుటవల్ల ప్రజానీకం ఆ ఉద్గ్రంథాన్ని చదివి తమ మతంలోని గుణ విశేషాలు తెలుసుకొని, చర్చి వ్యవస్థయొక్క లోపాలను గ్రహించి, పోప్ అధికారాన్ని ఎదిరించారు. చాలా దురాచారాలు రిఫార్మేషన్ వల్లనే తొలగింపబడ్డవి. జర్మనీ విశ్వవిద్యాలయాలు రినేశాన్స్ చైతన్యానికి కేంద్రాలై వాదోపవాదాలకూ తర్జన భర్జనలకూ నిలయాలై ఉండేవి.

రినైశాన్స్‌వల్ల విచారణాతత్వం పెంపొందింది. వైజ్ఞానికంగా నూతన విషయాలు కనుగొనబడ్డవి. కోపర్నికస్ (1473 - 1543) అను పోలెండు దేశీయుడు భూమి గుండ్రంగా ఉండి అది సూర్యునిచుట్టూ పరిభ్రమిస్తూ ఉందని ప్రకటించాడు. గెలీలియో గ్రహాలనూ, నక్షత్రాలనూ పరిశీలించడానికై దూరదర్శినిని నిర్మించాడు. కెప్లర్, న్యూటన్ వంటి శాస్త్రజ్ఞులు కొత్త అంశాలు కనుగొన్నారు. సైన్స్ వృద్ధిజెందింది. కొత్తదేశాలు కనుగొన్నారు. వ్యాపార వాణి

జ్యాలు వ్యాప్తిగాంచినవి. ఈ విధంగా యూరపు పునరుజ్జీవనం ఒక ప్రాచీన వారసత్వాన్ని, సంస్కృతిని పునర్దర్శనం చేసుకోవడంవల్లనే సంప్రాప్తమైంది.

యూరపులో రినేశాన్స్ మత, సాహిత్య, కళా, వైజ్ఞానిక రంగాలలో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చింది. దేనినైనా హేతువాదంతో, తర్కబుద్ధితో విచారణ చేయవలెనని అది ప్రబోధించింది. ప్రాచీన శ్రేష్ఠ సాహిత్యానికి (classical learning) ఆదరణ లభించింది. విద్యా ప్రమాణాలు పెరిగాయి. సోక్రటీసు, ప్లేటో, అరిస్టోటల్ వంటి మహనీయుల తత్త్వాలు ప్రచారం పొందాయి. శాస్త్రీల పరామర్శ పెరిగింది. మానవోద్యమానికి సాహిత్యంలో, కళలలో చోటు దొరికింది. వ్యక్తిస్వాతంత్ర్య తత్త్వం పెంపు జెందింది. ఒక్క మాటలో చెప్పాలంటే మానవాళి పురోగమనం ఆరంభమైంది.

ఈ నూతనోజ్జీవనాన్ని గూర్చి విచారణ చేసిన వివేకానందుడు ఇంకా ఇట్లా వ్రాశాడు: "ఆ పురోగమన ప్రవాహం సహస్ర ముఖమై ప్రవహింప జొచ్చెను. యూరపులోని తక్కిన దేశ జాతులు ఆ వెల్లువనీటిని కొత్త కాలువలు త్రవ్వుకొని అత్యాసక్తితో తమ దేశములలోనికి మరలించుకొని తమ జీవిత రక్తమును అందులో పోసి దాని పరిణామమును, వేగమును అధికపరచిరి. ఆ వెల్లువ నీటి ప్రవాహము కాల పరిపాకమున హిందూదేశ తీరముల నెగదట్టినది." అంటే యూరపు పునరుజ్జీవనోద్యమ ప్రభావము భారతదేశంపై ప్రసరించిందని వివేకానందుడు స్పష్టంగా చెప్పాడు. 19వ శతాబ్దిలో భారతదేశంలో పొడసూపిన ఈ నూత్న జాగృతి యూరపులో సాంస్కృతికంగా, రాజకీయంగా ఆరంభమై వెల్లువవలె విజృంభించిన ప్రపంచోద్యమమే. అది మానవుని కళ్ళఎదుట వినూత్న భావనాలోకాలను సాక్షాత్కరింప జేసింది. మానవుడు తన శక్తి యుక్తులతో స్వాతంత్ర్యం, సామరస్యం విలసిల్లే ఒక నవలోకాన్నీ, తద్వారా ఉజ్జ్వలమైన భవిష్యత్తునూ నిర్మించుకొనే అవకాశాన్నీ కలుగజేసింది. దేశంలో ద్రష్టలైన ప్రజ్ఞావంతులు ఆ ఉద్యమ స్వరూపాన్ని ఆకళింపు చేసుకొని భారత పునరుజ్జీవనానికై తమ తమ రంగాలలో కొత్త బాటలు వేసి దానిని ప్రవేశపెట్టారు. కొత్త ఉద్యమాలు లేవదీశారు. వినూత్న కృతులు వెలయించారు. ప్రజానీకంలో మున్నెన్నడూ లేని చైతన్యాన్ని సృష్టించారు. వాతావరణం మారింది. పరిసరాలు కొత్తగా కన్పట్ట నారంభించాయి. సర్వతోముఖమైన పరివర్తనం, పరిణామం

సంభవించాయి. అదే భారతీయ పునరుజ్జీవనం. ఇది మొదట బెంగాలుకో ఆరంభమై క్రమేణా దేశమంతటికీ వ్యాపించింది.

బెంగాలులో ఈ ఉద్యమం ఆరంభం కావడానికి కొన్ని కారణాలున్నాయి. ఒక కారణమేమిటంటే - బెంగాలు ముందుగా పాశ్చాత్యుల (బ్రిటిషువారి) ఏలుబడిక్రిందికి వచ్చి హెచ్చుకాలం వారి ప్రభావంక్రింద ఉంది. పంజాబు మున్నగు ప్రాంతాలు తరువాత వారి అధీనమయ్యాయి. రెండవ కారణం ఆంగ్ల విద్య, పాశ్చాత్య సంపర్కం బెంగాలీలను మొదట తాకినవి. మూడవ కారణం భారత పునరుజ్జీవనానికి మార్గదర్శి అయిన రాజా రామమోహనరాయ్ బెంగాలులో జన్మించాడు. అయితే ప్రముఖ చరిత్రకారుడు సర్ యదునాధ సర్కార్ ఇట్లా అన్నాడు: ''గ్రీసు దేశానికి పెరిక్లియన్ కాలపు (క్రీ॥ పూ॥ 429 - ఏథెన్స్‌లో సాహిత్యం, కళలు మున్నగువాని స్వర్ణయుగం) ఏథెన్స్ నగరంవలె బ్రిటిషు యుగంలో తక్కిన భారతదేశానికి బెంగాలు అటువంటిది. నవీన వంగభూమిలో ఆధునిక ప్రపంచం తాలూకు ప్రతి గొప్ప విశేషానికీ, ప్రతి ఉత్తమ పరివర్తనకూ అంకురార్పణ జరిగింది. తరువాత ఆయా విశేషాలు ఇతర ప్రాంతాలకు వ్యాపించాయి. ఇంగ్లీషు చదువులు, మత సంస్కారోద్యమాలు, నూతన సాహిత్య ప్రక్రియలు, చివరకు మనుషుల తీరు తెన్నులలో, నడవడిలో, రీతులలో వచ్చిన మార్పులు కూడా బెంగాలునుండి భారతదేశపు మారుమూలలకు వ్యాపించాయి.'' సర్కార్ కొంత సగర్వంగా చెప్పుకొన్నప్పటికీ ఇది యథార్థమే. మన పునరుజ్జీవనోద్యమం మూలపురుషులకెందరికో వంగదేశం జన్మభూమి.

# 3. మార్గదర్శి

ఆధునిక యుగంలో భారతీయ పునరుజ్జీవనోద్యమానికి మూల పురుషుడు రాజా రామమోహనరాయ్ (1772–1833). ఈయన బెంగాలులోని రాధా నగర్‌లో ఒక సనాతన బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. అప్పుడా కుగ్రామం బర్ద్వాన్ జిల్లాలో ఉండేది. తరువాత దానిని హుగ్లీ జిల్లాలో చేర్చారు. భారత మహాపురుషులలో రామమోహనుడు ఒక అపూర్వవ్యక్తి. "ఇటువంటి వ్యక్తి రాక కోసమే మన చరిత్ర ఒక దీర్ఘరాత్రి అంతా వేచి ఉంది" అని రవీంద్రనాథ టాగూరు (1861-1941) అన్నాడు. రామమోహనుడు స్ఫురద్రూపి, తేజస్వి, మేరుధీరుడు. ఆయన జన్మించిన కాలమే చరిత్రలో ఒక పెద్ద మలుపు. ఆయన పుట్టిన కొద్ది కాలానికే అమెరికా స్వాతంత్ర్యం ప్రకటించింది. ఆయనకు ఇరవయ్యో యేడు రాగానే ఫ్రెంచి విప్లవం సంభవించింది. ఇవి రెండూ ప్రపంచ చరిత్రలో రెండు మహా సంఘటనలు. రాయ్ జన్మతః స్వాతంత్ర్య పిపాసి కాబట్టి ఫ్రెంచి విప్లవానికి జేజేలు పలికాడు. స్పెయిన్, పోర్చుగల్ దేశాలలో రాజ్యాంగబద్ధమైన ప్రభుత్వాలు ఏర్పడినందుకు ఆయన ఎంతగానో సంతసించాడు. బ్రిటిషువారి ఆక్రమణను ప్రతిఘటిస్తూ ఐర్లెండు దేశీయులు జరిపిన ఆందోళనను బలపరిచాడు. రాయ్ బహుభాషా వేత్త. బెంగాలీ, సంస్కృతం, పాళీ, అరబ్బీ, ఫారసీ, ఉర్దూ, హిందీ భాషలలో ఆయన దిట్ట. పాశ్చాత్య మతానికీ, సంస్కృతికీ మూలాధారము లేవో తెలుసుకొనడానికై గ్రీకు, లాటిన్, హీబ్రూ భాషలు కూడా నేర్చుకున్నాడు. ఇక ఆంగ్లభాషలో ఆయన వచన రచనా నైపుణి జగద్విదితం. ఎటువంటి భావాన్ని అయినా ఉదాత్తంగా స్పష్టంగా వ్యక్తీకరిస్తూ ఇంగ్లీషులో వ్రాయ గలిగే వాడు. ఇవికాక ఆయనకు ఫ్రెంచి, ఇటాలియన్, స్పానిష్, టిబెటన్ భాషలతో పరిచయం ఉండేది. తర్కముతో కూడిన శైలిలో బెంగాలీ వచన రచన ఆయనతోనే ఆరంభమైంది. రామమోహనుడు లేకపోతే ఈశ్వరచంద్ర విద్యాసాగర్, బంకించంద్రుడు, రవీంద్రుడు ఆవిర్భవించడం సాధ్యమయ్యే పని కాదని బెంగాలీ సాహిత్య చరిత్ర వ్రాసిన సుకుమార సెన్ అన్నాడు. రాయ్ భగవద్గీ

తను బెంగాలీ పద్య కావ్యంగా రచించాడు. ఆయన వ్రాసిన బెంగాలీ వ్యాకరణం ఆ రోజులలో సరికొత్తదీ ఉత్తమమైనదీ మాత్రమేకాక దాని తరువాత వచ్చిన వ్యాకరణాలు దానికన్న మెరుగైనవేమీ కావని భాషావేత్తలు అంటారు. ఆయన అరబ్బీ భాషలో కురాను, సంస్కృతంలో వేదాలు, ఉపనిషత్తులు, హీబ్రూ భాషలో పాత నిబంధన (Old Testament) గ్రీకు భాషలో నూతన నిబంధన (New Testament) చదివి వాటిని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్నాడు. హిందూ మత గ్రంథాలను, శాస్త్రాలను ఆయన ఆంగ్లములోకి అనువదించడం వల్లనే ఆధునిక కాలంలో భారతదేశ సందేశం పాశ్చాత్య ప్రపంచానికి సులభంగా అందింది. వేదాంతం, ధర్మశాస్త్రం, తత్త్వశాస్త్రం, సాహిత్యం, న్యాయశాస్త్రం, రాజనీతి, చరిత్ర- ఇవి ఆయనకు అభిమాన విషయాలు. వీటిలో ఆయనకు గల పరిజ్ఞానం అపారం. బెంగాలులో పత్రికా రచనకు ఆయనే ఆద్యుడు, బెంగాలీ-ఇంగ్లీషు భాషలలో ఒక ద్విభాషా పత్రికను, సమస్త భారతదేశానికీ ఒక పారసీ వార పత్రికను ప్రచురించాడు. పత్రికా రచనకు సాంఘిక ప్రయోజనం ఉండవలెనని నిర్దేశించాడు. ఆయన కృషివల్ల దేశంలో విజ్ఞతకల ప్రజాభిప్రాయం రూపొందింది. ప్రపంచ మతాలైన హైందవము, ఇస్లాము, బౌద్ధము, క్రైస్తవము—ఈ నాల్గింటిని ఒక దానితో మరొక దానిని పోల్చుకుంటూ అధ్యయన పరిశీలనాదులు జరిపిన మొదటి భారతీయుడు ఆయనే. మతాల తులనాత్మక పరిశీలనానికి బాటవేసినవాడు రామమోహనుడే నని ప్రొఫెసర్ మోనియర్ విలియమ్స్ అభిప్రాయం. భారతదేశంలో మొట్టమొదటి ఆధునికుడు ఆయనే.

ఆధునిక యుగంలో భారతదేశంలో రామమోహనరాయ్ మొట్టమొదటి హేతువాది. పునరుజ్జీవనోద్యమానికి ఒక ముఖ్యలక్షణమైన విచారణాతత్త్వం, జిజ్ఞాస ఆయనలో ప్రబలంగా ద్యోతకమయ్యేవి. ఏ విషయాన్నయినా హేతువాద బుద్ధితో ఆలోచించి మంచి చెడ్డలు నిర్ణయించుకునేవాడు. అభిప్రాయభేదం ఉంటే అవతలి వ్యక్తి ఎవరైనాసరే డీకొని వాదప్రతివాదాలతో సత్యనిర్ధారణకు పూనుకొనేవాడు. కాబట్టే క్రైస్తవ మతమంటే ఆయనకు అభిమానమున్నప్పటికీ, వారి కొన్ని సిద్ధాంతాలు నచ్చకపోయే సరికి తాను ఒక్కడే వారిని ఎదురొడ్డి నిలిచి, చాల పెద్ద వాగ్వివాదంలో చిక్కుకొని తన అభిప్రాయాన్ని ఖండితంగా చెప్పాడు. ఆయన వాదంలోని పటిమను అర్థం చేసుకొన్న ఖండాంతర

క్రైస్తవ విజ్ఞులు ఆయన రచనను వారిదేశంలో పునర్ముద్రించిన సందర్భాలు కూడా ఉన్నాయి.

పాశ్చాత్య నాగరికతనూ, వారి ఆలోచనా రీతినీ అర్థం చేసుకొన్న మొదటి భారతీయుడు కూడా రామమోహనుడే. మొదట హిందూ ముస్లిం మిశ్రమ సంస్కృతి అనే తల్లికి బిడ్డడు. ఆపైన పాశ్చాత్యచింతన అనే వెలుగును దర్శించాడు. దాని వైశిష్ట్యాన్ని గమనించాడు. యూరపు ఖండంలో అప్పుడు వ్యాప్తిలో ఉన్న రాజకీయ మితవాదం (Liberalism), విజ్ఞానశాస్త్ర సాంకేతిక విధానాలు ఆయనను ఆకట్టుకొన్నాయి. మానవాళికి సైన్సు ప్రయోజనాన్ని గమనించాడు. పాశ్చాత్య సంస్కృతిలోని ఉత్తమాంశాలను ఆయన ఎల్లప్పుడూ సమర్థించేవాడు. దానిలోని దొసగులను కూడా అర్థం చేసుకొన్నాడు. పాశ్చాత్య లోకంలో దృగ్గోచరమైన మానవతావాదంచే ఆకర్షితుడయ్యాడు. జీవితాన్ని ఆయన మానవతావాద దృక్పథంతోనే పరిశీలించేవాడు. భారత సంస్కృతి సంప్రదాయాల ఔన్నత్యం ఆయన ఎరుగును. అయితే ప్రాక్పశ్చిమ సంస్కృతుల ఐక్యమును వాంఛించి ఆ ఆశయసిద్ధికై పాటుపడ్డాడు. అట్టి సంయోగాన్ని, సమన్వయాన్ని రాయ్ సిద్ధింపజేసుకోగలిగాడని మాక్స్ ముల్లర్ పండితుడు వ్రాశాడు. జన్మతః జీవకారుణ్య దృష్టికలవాడు. కనుకనే హిందూ మతంలోని దురాచారాలను చూచి సహించలేక సంస్కరణ అత్యవసరమని ఎలుగెత్తి చాటాడు. ఆ కాలంలో అంతటి సంఘ సంస్కర్త మరొక రెవరు? సంఘ సంస్కరణ మాత్రమే కాదు, బహుముఖ సమాజోద్ధరణకు పూనుకొన్న పురోగామి. ఆయన భావనాలోకం, దృష్టి, హృదయవైశాల్యం అసమానమైనవి. ఆయన కలలుకన్న భారతదేశం వీర్యవంతము, ఓజోవంతము అయినది. ఆధునిక విజ్ఞానం విషయంలో, మానవీయ ఆదర్శాల విషయంలో భారతదేశాన్ని బౌద్ధికంగా నైతికంగా ఒక గొప్ప దేశంగా తీర్చిదిద్దాలనుకున్నాడు. సాంఘికంగా ఎంతటి మహా పరివర్తనం అభిలషించాడో, సాంస్కృతికంగా అంతటి పునరుద్ధరణకు కూడా పూనుకొన్నాడు. కాబట్టే రోమారోలావంటి మహనీయుడు "రామమోహనుడు తన ఆదర్శాలనూ ప్రగాఢవాంఛలనూ బెంగాలు నేలలో విత్తగా ఎంతటి దండి పంట పండింది! ఎటువంటి మహాత్ములైన వ్యక్తులను, ఎంతటి అమూల్య కృతులను లోకం చూచింది!"

అన్నాడు. ఆధునిక భారత చరిత్ర రామమోహనునితోనే ఆరంభమవుతుందని అంటే అది అతిశయోక్తి కాదు.

భారత జాతీయ భావానికి రూపురేకలు దిద్దడంలో రాయ్ చేసిన కృషి కొందరి దృష్టికి రాకపోవడం విచారకరం. అయినా అభిజ్ఞులు దానిని గమనించక పోలేదు. డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు వారు వ్రాసిన 'భారత జాతీయ కాంగ్రెసు చరిత్ర'లో "ఒక దృష్టితో చూస్తే రామమోహనరాయ్ భారత జాతీయతకు ప్రవక్త అని చెప్పవచ్చు. ఆయన శ్రద్ధాసక్తులన్నీ ఆ కాలపు మత, ధార్మిక, సాంఘిక పరిస్థితులపై కేంద్రీకరింపబడి ఉన్నప్పటికిని, తన కాలంలోని రాజకీయ ఘోరాలను, అక్రమాలను సునిశిత దృష్టితో పరికించాడాయన" అని వ్రాశారు. "ఆయన ఉంటే స్వతంత్రుడుగానే ఉంటాడు, లేకపోతే అసలు ఉండడు" అని రెవరెండ్ ఆదం అన్నట్లు గుర్తు. ఆయన స్వాతంత్ర్యేచ్ఛ, స్వేచ్ఛా ప్రియత్వం అటువంటివి. ఆయన రాజకీయ భావాల ఆదర్శం లోకసంగ్రహం. బ్రిటిషు పాలకులు భారతదేశాన్ని ఆర్థికంగా ఎంత కొల్లగొట్టుతున్నదీ దేశీయుల దృష్టికి మొదట తెచ్చినవాడు ఆయనే. భూవ్యవస్థకు సంబంధించిన శాసనాలు ప్రజలకెంత భారంగా ఉన్నదీ ఒక పిటీషన్‌ద్వారా ప్రభుత్వ దృష్టికి తెచ్చాడు. ప్రభుత్వపాలనా యంత్రాంగంలో భారతీయులకు చోటివ్వవలెనని కోరాడు. హిందువులకు సంబంధించిన శాసనాల సంస్కరణ జరగవలెనన్నాడు. మహిళల పురాతనమైన హక్కులను ఆధునిక కాలంలో భంగపుచ్చడం జరుగుతున్నదని హెచ్చరించాడు. బెంగాలు పల్లెసీమలలో ప్రభుత్వం పరిశ్రమలు పెట్టి రైతులకు ఉపాధి కల్పించాలని కోరినవాడాయన. సమస్తదేశాల స్వాతంత్ర్యోద్యమాలను బలపరచి అందరికీ ప్రజాస్వామ్య సత్త్వములుండవలెనని ఉద్ఘోషించిన వాడాయన. ఆత్మనిగ్రహంతో కూడిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలవల్ల వ్యక్తికి సమాజానికి వికాసం చేకూరుతుందని గట్టిగా నమ్మిన వాడాయన. వివిధ జాతుల మధ్య, దేశాలమధ్య తలయెత్తే వివాదాలను పరిష్కరించడానికై అంతర్జాతీయ సంస్థ ఏదైనా ఉండటం అవసరమన్న భావనను ఆకాలంలోనే ప్రతిపాదించి ప్రపంచ శాంతిపరిరక్షణకు నేటి ఐక్యరాజ్య సమితి వంటి సంస్థ ఆవశ్యకతను గ్రహించిన ద్రష్ట. మధ్యయుగపు ప్రగతి నిరోధక శక్తులతో పోరాడటంలో తన జీవితకాలాన్నంతా వెచ్చించినందుకు ఆయనను భారత పునరుజ్జీవనమునకు పితగా పరిగణించాలని బిపిన్‌చంద్రపాల్ (1858-

–1932) అన్నాడు. 19 వ శతాబ్దిలో భారతీయ సమాజాభ్యున్నతికై ముఖ్యమైన ఉద్యమాలన్నిటికీ బీజములు వేసినవాడు రామమోహనరాయలు.

రాజా రామోహనరాయ్ నవయుగకర్త. విశ్వజనీన మత సాధకుడు. విశ్వవ్యాప్త మానవతావాదానికి పట్టుగొమ్మ. ఏ రంగంలోనైనా సరే, కొత్తబాట వేయడానికి సంసిద్ధుడైన సాహసి. ప్రధానంగా జాతినిర్మాత. అట్టి శ్రేష్ఠ మానవుడు భారత పునరుజ్జీవనోద్యమానికి నాయకత్వం వహించడంవల్లనే ఆ ఉద్యమం మూడు పూలు ఆరు కాయలై ఈ ప్రాచీన విశాల దేశాన్ని మధ్య యుగాల దురవస్థనుంచి ఆధునిక యుగంలోకి తీసుకువచ్చి అగ్రశ్రేణిలో నిలబెట్టింది.

# 4. ఆంగ్లవిద్య - పాశ్చాత్య సంపర్కం

19వ శతాబ్దిలో భారతదేశంలో గొప్ప పరివర్తనాన్ని తీసుకురావడానికి దోహదం చేసిన వాటిలో ముఖ్యమైనది ఆంగ్లవిద్య. అది మన దేశీయులలో భావ విప్లవాన్ని తీసుకువచ్చి పునరుజ్జీవనానికి చక్కని బాట వేసింది.

భారతదేశంలో ఆంగ్లవిద్య విషయంలో ఆనాటి నుంచి ఈనాటి వరకూ వ్యతిరేకాభిప్రాయం ఉండనే ఉన్నది. ఇంగ్లీషువారు ఆంగ్ల విద్యను వారి పరిపాలనకు ఉపయోగపడే గుమాస్తాలను తయారు చేయడానికై ప్రవేశపెట్టారని చాలా మంది అంటారు. నిజమే. లేకపోతే ఈ దేశ పరిపాలనకు కావలసిన గుమాస్తాలను వారి దేశంనుంచి దిగుమతి చేసుకోగలరా? ఈ విద్యను ప్రవేశపెట్టడానికి కారకుడైన మెకాలే ఉద్దేశాలు కొనియాడదగినవని కూడా అనలేము. మెకాలే తలపెట్టినది భారతీయులలోనుంచి పూర్తిగా జాతీయతా భావ నిర్మూలన మని 'మోడర్న్ ఇండియా' గ్రంథరచయిత సర్ పెర్సివల్ గ్రిఫిత్స్ వ్రాశాడు. అయితే ఆనాడు తీసుకొన్న నిర్ణయం భారతదేశ చరిత్రలో పెద్ద మలుపు అని ఇప్పుడు చెప్పవచ్చు. అయినా ఆంగ్లానికి బదులు ఆనాడు ఉన్న మరొక భాష ఏమిటి? సంస్కృతం, ఫారసీ భాషలు మినహాయిస్తే, ఇతర భారతీయ భాషలు ఆధునిక వ్యక్తీకరణలో సెకండరీ విద్యాప్రమాణానికి తగ్గస్థాయికికూడా చేరుకో లేదు. అటువంటప్పుడు వాటితో విశ్వవిద్యాలయ స్థాయివరకూ సార్వజనీన విద్యను ప్రవేశపెట్టటం సాధ్యంకాని పని. ఒకవేళ సంస్కృత, ఫారసీ భాషలలో దేనినైనా అభివృద్ధి పరచి ఆ భాషలో విశ్వవిద్యాలయ ప్రమాణాలకు తగినట్లు విద్యావిధానాన్ని రూపొందించాలంటే అందుకు ఎన్ని దశాబ్దాలు పట్టేదో! ఇక హిందీ, ఉర్దూ భాషలు ఆనాడు అంతగా అభివృద్ధి చెందలేదు. దేశమంతటా వాటికి వ్యాప్తిలేదు. కాబట్టి ఆంగ్ల విద్యా విధానం అవాంఛనీయమని నిరసించి, దానిని సమర్థించిన వారంతా ఆంగ్ల మానస పుత్రులని నిందించడాన్ని ఒక పరిహాసోక్తిగా స్వీకరించవచ్చునేమోగాని అది పరిపూర్ణ సత్యమని అభిజ్ఞులనరు. పర పరిపాలకుల భాష అని చెప్పి దానిపై తిరస్కారభావం ఉండవచ్చునేమోకాని, గొప్ప నవ్యసాహిత్యం ఉన్న భాషగా, విజ్ఞాన శాస్త్ర వాహికగా ఆంగ్లానికి ప్రపంచంలో ఉన్న స్థానం చాలా కొద్ది భాషలకే ఉంది.

ఆంగ్లభాష ప్రవేశపెట్టబడటానికి పూర్వం మన దేశంలో విద్యా విధానం ఎలా ఉండేదో పరిశీలిద్దాము. దేశ పాలనాధికారాన్ని బ్రిటిషువారు తమ హస్తగతం చేసుకొన్నప్పుడు ఉన్నతవిద్య అంతా సంస్కృతం, అరబ్బీ,పారసీవంటి ప్రాచీన భాషలకే పరిమితమై ఉండేది. ఆ కాలంలో ఉన్నత విద్యాభ్యాసమంటే వ్యాకరణం, ప్రాచీన సాహిత్యం, తర్క, న్యాయ, తత్త్వశాస్త్రాలు, మతగ్రంథ పఠనం—ఇంతే. ఇక వీధి బళ్ళలో ఏదో ఒక భాషను వ్రాయడం, చదవడం, లెక్కలు నేర్పేవారు. ప్రాంతీయ భాషలను ఆధునికం చేసి అభివృద్ధి పరచే కృషి జరగలేదు. ఈ విధంగా విద్యావిషయకంగా, నవీన విజ్ఞానాభివృద్ధి రీత్యా భారతదేశం యూరపు ఖండంలోని మధ్యయుగాలనాటి స్థితిలో ఉంది. బయటి ప్రపంచంలో ఏమి జరుగుతున్నదో భారతీయులకు ఏమీ తెలియవచ్చేది కాదు. రినైశాన్స్ తరువాత యూరపు ఖండం అభ్యుదయ పరంపరాభివృద్ధిగా ఎట్లా ముందుకు సాగిపోయిందో మనకు తెలియనే తెలియదు. అసలు ఈ విషయాలలో అప్పుడు ఆసక్తి ఎవరికుంది?

ఈస్టిండియా కంపెనీవారు దేశాన్ని కొల్లగొట్టడం, ఒక రాజును దువ్వి అతన్ని బలపరచడం, మరొక రాజును మట్టుబెట్టడం, చివరకు ఇద్దరి ఏలుబడినీ అంతముచేసి తాము పాలనాధిపత్యం వహించడం, అధికార పటాటోపం చూపడం తప్ప వారు దేశీయుల విద్యాభివృద్ధికి ఏమీ చేయలేదు. పైగా విద్యావ్యాప్తివల్ల అమెరికాను చేజేతులా పోగొట్టుకున్నామనీ, అటువంటి పొరపాటుపని భారతదేశంలో చేయకూడదనీ వాదించిన కంపెనీ అధిపతులున్నారు. కాని కంపెనీ సివిల్ అధికారులలో ఒకడైన చార్లెస్ గ్రాంట్ భారతదేశంలో ఇంగ్లీషు భాషను బోధించే స్కూళ్ళు పెట్టాలనీ, ఆ భాషద్వారా భారతీయులకు కొత్త భావాలు కలుగ జేయాలనీ ప్రతిపాదించాడు. పైవారు ఆయన ప్రతిపాదనను త్రోసిపుచ్చారు. 1818 లో కంపెనీ చార్టర్‌ను పునరుద్ధరించేటప్పుడు దేశీయులకు ఉపయోగకరమైన విజ్ఞానాన్ని అందజేసేటందుకు కంపెనీ తగు చర్యలు తీసుకోవాలనీ, అందుకు ఏటా కొంతమొత్తం కేటాయించాలనీ బ్రిటిషు పార్లమెంటు ఆదేశించింది. అయినా ఫలితమేమీ కలుగలేదు. ఈలోపల ప్రభుత్వంతో నిమిత్తం లేకుండా బెంగాలులో శ్రీరాంపూర్ క్రైస్తవ మిషనరీలైన విలియంకేరీ, మార్ష్‌మన్‌ల నాయకత్వాన ఇంగ్లీషు చదువుచెప్పే కార్యక్రమం చేపట్టడం జరిగింది. దేశభాషల అభివృద్ధికి కూడా ఆ మిషనరీలు కృషి సల్పారు. మద్రాసు

మిషనరీలు ప్రభుత్వ సహాయంతో ప్రజలకు ఇంగ్లీషు నేర్పడం మొదలుపెట్టారు. ఇట్లా ఉండగా రాజా రామమోహనరాయ్ రంగంలోకి ప్రవేశించాడు. భారతీయులకు యూరపియన్ భాషలు, సైన్స్ శాస్త్రాలు బోధించేందుకై ఒక విద్యా సంస్థను నెలకొల్పుటకు అవసరమైన సమితిని ఏర్పాటు చేశాడు. కొందరు సనాతనులు రాయ్ అట్టి కార్యనిర్వహణ వహించడాన్ని ఎదిరించగా, ఆయన డేవిడ్ హేర్ సహకారంతో 1817 లో హిందూ కాలేజీ స్థాపనలో కృతకృత్యుడయ్యాడు. అదే తర్వాత ప్రెసిడెన్సీ కాలేజీగా అభివృద్ధి చెందింది. 1822 లో రామమోహనుడు యునిటేరియన్ అసోసియేషన్ ఆధ్వర్యాన హైఇంగ్లీషు స్కూలు స్థాపించాడు. అందులో రవీంద్రుని తండ్రిగారైన మహర్షి దేవేంద్రనాథ టాగూరు (1817–1905) ఒక విద్యార్థి.

1823 లో బెంగాలులో పాలకులు పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ కమిటీని ఏర్పాటు చేశారు. ఆ వెంటనే కలకత్తాలో సంస్కృత కళాశాల నొకదానిని స్థాపించడానికి చర్యలు గైకొంటుండగా రాజా రామమోహనరాయ్ అట్టి కళాశాల స్థాపనను వ్యతిరేకించాడు. అటువంటి కళాశాలను స్థాపించి దేశం ముందుకుపోయే అవకాశం లేకుండా ప్రభుత్వంవారు చేయబోతున్నారని రాయ్ లార్డు ఆమ్‌హర్స్టుకు ఒక పిటీషన్ సమర్పించాడు. ఆ పిటీషను చారిత్రక ప్రాముఖ్యంకల పత్రము. దేశంలో కొందరు అభ్యుదయదృష్టితో నాటి దేశావసరాలను గ్రహించారని అది మనకు తెలియజేస్తుంది. ఆ పత్రంలోని ముఖ్యాంశం ఇట్లా వుంది: "ప్రభుత్వం వారు హిందూ పండితులతో సంస్కృత కళాశాల నెలకొల్పబోతున్నారు. అయితే సంస్కృత భాషాజ్ఞానం ఈ దేశంలో ఇదివరకే వుంది. ఇప్పుడీ కొత్త సంస్థ దేశంలోని యువకుల బుర్రలను వ్యాకరణపు సొగసులతో తత్త్వమీమాంసాది విశేషాలతో నింపుతుందన్నమాట. వాటివల్ల సమాజానికి ప్రత్యక్ష ప్రయోజనమేమీ ఉండదు. కొత్త సంస్థ విద్యార్థులు ఇప్పటికి రెండువేల ఏండ్ల క్రితం ఈ దేశానికి తెలిసిన విషయాలనే మరల నేర్చుకొనవలసి ఉంటుంది. కాకపోతే పండితోత్తములు ఈ దరిమిలా కనుగొన్న మరికొన్ని రమ్యతలను అదనంగా బోధిస్తారేమో! అటువంటివి ఇప్పటికే భారతదేశమంతటా నేర్పుతున్నారు... సంస్కృత విద్యావిధానం ఈ దేశాన్ని ఇంకా అంధయుగంలో ఉంచడానికే తోడ్పడుతుంది. బ్రిటిషు పార్లమెంటు విధానం ఇదేనా? బ్రిటిషువారి దేశీయ జనాభా (Native population) అభ్యున్నతి ప్రభుత్వంవారి లక్ష్యమై ఉన్నది. అందుకై గణి

తము, ప్రకృతిశాస్త్రములు, రసాయనశాస్త్రము, శరీరశాస్త్రము వంటి ప్రయోజన కరమైన సైన్సులను యూరపులో విద్యాభ్యాసం చేసిన ప్రతిభావంతులచే బోధింప జేసే విశేషవిద్యను ప్రవేశపెట్టి, అందు కవసరమైన పుస్తకాలు, పరికరాలు, సామగ్రి కలిగిఉండే సర్వసమృద్ధమైన కళాశాలను నెలకొల్పడం సముచితమైన కార్యం కాగలదు.''

ఈ పిటీషను సమాధానానికి కూడా అర్హత కలది కాదని ఒక తెల్లదొర త్రోసిపుచ్చాడు. ఛాందసులైనవారు రామమోహనుడు దేశ విద్యావిధానంలోనుంచి సంస్కృతాన్ని పూర్తిగా తొలగింప సమకట్టాడని దుష్ప్రచారం చేశారు. కాని రామమోహనరాయ్ అంతకుపూర్వమే ఒక కళాశాల నెలకొల్పి అందులో విద్యార్థులకు సంస్కృత సాహిత్యాన్ని బోధించే ఏర్పాట్లు చేశాడనీ, ఆ సంస్థద్వారా హిందూ ఈశ్వరైక్యవాద సమర్థనకూడా జరిగిందన్న విషయాన్నీ విస్మరించారు.

ఈలోగా క్రమేపీ దేశీయులు ఇంగ్లీషు చదువు ప్రాముఖ్యాన్ని గుర్తించారు. క్రైస్తవ మిషనరీలు, ఉదారులైన కొందరు భారతీయులు కలిసి పాశ్చాత్య పద్ధతిపై స్కూలు బుక్ సొసైటీ స్థాపించారు. ఇంగ్లీషు పుస్తకాలు ప్రచురించారు. రెండేండ్లలో కొన్నివేల ఆంగ్ల గ్రంథాలు అమ్ముడుపోయాయి. మెల్లగా కొత్త భావాలు వ్యాపించెందసాగాయి. పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ కమిటీలో రెండు వర్గాలు ఏర్పడ్డాయి. ఒకవర్గంవారు 'ఓరియంటలిస్టులు'. అంటే ప్రాచ్యవిద్యయే ఉండవలెననేవారు. రెండవ వర్గంవారు 'ఆంగ్లిసిస్టులు'. అనగా ఆంగ్లవిద్యను ప్రవేశపెట్టి దానిద్వారా సైన్సు శాస్త్రాలను బోధింపవలెనని కోరేవారు. ఈ రెండవ వర్గంవారికి రామమోహనరాయ్ నాయకుడై నిర్విరామంగా కృషి చేశాడు.

1835 లో లార్డు విలియం బెంటింక్ కలకత్తాలో వైద్యకళాశాల స్థాపించాడు. 1834 లోనే పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ కమిటీ అధ్యక్షుడుగా థామస్ బాబింగ్టన్ మెకాలే నియమితుడయ్యాడు. ప్రాచ్యవిద్య-ఆంగ్లవిద్య - వివాదం అప్పటికి ముమ్మరమైంది. మెకాలే 1835 ఫిబ్రవరి 2 వ తేదీన వ్రాసిన మినిట్‌లో ఆంగ్ల విద్య కావాలనేవారిని సమర్థిస్తూ గవర్నర్‌జనరల్ బెంటింక్‌కు నచ్చజెప్పగలిగాడు. దానితో కౌన్సిల్‌వారు ''ఇకనుంచి లభ్యమయ్యే నిధులు దేశీయ జనాభాకు ఇంగ్లీషుభాష మాధ్యమంగా ఆంగ్లసాహిత్యాన్ని, సైన్సులను బోధించడానికి

ఖర్చుపెట్టడం జరుగుతుంది" అని నిర్ణయించారు. అయితే ఆంగ్లము, గణితము, సైన్సు బోధనను ప్రవేశపెట్టవలెనని ఆందోళన జరిపిన రామమోహనుడు మరణించిన కొన్నేండ్ల తర్వాతనే ఆ విధానం అమలులోకి వచ్చింది. అట్లా భారత దేశంలో సశాస్త్రీయ విద్యావిధానానికి అంకురార్పణ జరిగింది.

తరవాత 1844 లో ప్రభుత్వం ఒక తీర్మానంద్వారా ఆంగ్లభాషతో మంచి పరిచయమున్నవారికీ, పాశ్చాత్య విజ్ఞానశాస్త్రం చదువుకొన్నవారికి ప్రభుత్వోద్యోగాలలో స్థానమివ్వబడుతుందని ప్రకటించడంతో ఇంగ్లీషు చదువులు బాగా వ్యాప్తమయ్యాయి. బోర్డు ఆఫ్ కంట్రోలు అధ్యక్షుడైన సర్ చార్లెస్ వుడ్ 1854 లో సమర్పించిన డిశ్పాచి (పత్రము) తో సమగ్రము, సమన్వితము అయిన విద్యావిధానం రూపొందింది. ఆ పత్రం ఇండియాలో ఇంగ్లీషు విద్యకు మేగ్నా కార్టా వంటిదని విజ్ఞుల అభిప్రాయం. ఆ తరువాత 1857 లో కలకత్తా, బొంబాయి, మద్రాసు ప్రెసిడెన్సీ నగరాలలో విశ్వవిద్యాలయాలు ఏర్పడ్డాయి. మొదట్లో ఇంగ్లీషు విద్యవల్ల మధ్యతరగతివారు హెచ్చు ప్రయోజనం పొందారు. శ్రీమంతులు, సంప్రదాయవాదులు,ముస్లిములు ఆంగ్లవిద్యకు దూరంగా ఉన్నారు. క్రమేణా ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత పాఠశాలలు, కళాశాలలు ఏర్పడ్డాయి. రాష్ట్రాలలో విద్యాశాఖలు ఏర్పాటైనవి. స్కూళ్ళకు గ్రాంట్లు, ప్రతిభకల విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లు ఇవ్వడం ఆరంభమైంది. బాలికల విద్యను ప్రోత్సహించారు. 1849 లో కలకత్తాలో హిందూ బాలికా విద్యాలయం ఏర్పడింది.

ఇంగ్లీషు చదువుల వ్యాప్తితో దేశం తీరుతెన్నులు మారాయి. తొలినాటి ఆ స్థితి ఎలా వుందో సురేంద్రనాథ బెనర్జీ (1848–1925) తాను వ్రాసిన 'నేషన్ ఇన్ ది మేకింగ్' అనే గ్రంథంలో ఇట్లా వ్రాశాడు: "ఇంగ్లీషు విద్య తొలి ఫలితాలు మరీ బ్రిటిషువారికి అనుసరపక్షంగా తయారయ్యాయి. పాశ్చాత్యుల సంస్కృతిలో, వారి నాగరికతలో మనవారికి పిసరంత దోషంకూడా అగుపించలేదు. దాని కొత్తదనానికీ, దాని వింతసోయగానికీ ముగ్ధులైపోయారు. వ్యక్తికి మాన్యత ఏర్పడటం, సాంప్రదాయిక ప్రమాణం స్థానంలో వ్యక్తిగత నిర్ణయాధికారం వాడుకలోకి రావడం, ఆచారాలకు బదులు కర్తవ్యానికి ఉన్నతపీఠం లభించడం—ఇవన్నీ ఇంతవరకూ పురాణకాలంనుంచీ గౌరవప్రదమైన సంప్రదాయంగా వస్తూ ఉన్నదానికి బద్ధులై ఉంటూ వచ్చిన ప్రాచ్యప్రజలకు అంత

వరకూ గూఢంగా ఉన్న ఒకానొక కొత్తలోకం ఆకస్మికంగా పెద్ద ఉరవడితో మీదవచ్చి పడ్డట్టయింది. ఇంగ్లీషుకూ, ఇంగ్లీషువారికీ చెందిన ప్రతిదీ మంచిదే అయింది. చివరకు బ్రాందీ త్రాగడంకూడా ఒక సుగుణమే. ఇంగ్లీషువారికి చెందనిదానిని అనుమానంగా చూచేవారు.'' ఆ కొత్తలో మరీ కొందరు భారతీయులు ఇంగ్లీషువారి ప్రభావానికి ఎంతగా లోనయ్యారో ఇది సూచిస్తుంది.ఒక కొత్త ప్రభావం వచ్చినప్పుడు కొందరు దేశీయుల బుద్ధులు వెర్రితలలు వేయడం సహజం. అంతదాకా ఎందుకు ? ఆ తొలినాళ్ళలో తమ పిల్లలు ఇంగ్లీషులో మాట్లాడగలిగితే తల్లిదండ్రులు ఎంతగా సంతోషించేవారో మన 'కన్యాశుల్కం' నాటకంవల్ల తెలియవస్తుంది. కిస్మిస్ సెలవులకు వెంకటేశం తన గురువుగారైన గిరీశంతో టౌన్ నుంచి అగ్రహారం వస్తాడు. వెంకటేశం తల్లి వెంకమ్మ గిరీశంతో "మా అబ్బాయీ మీరూ ఒక్కపర్యాయం యింగిలీషు మాట్లాడండి బాబూ'' అంటుంది. వాళ్ళిద్దరూ ఏవో ఇంగ్లీషులో మాట్లాడేస్తారు. పెద్దవాళ్ళు ఎంత సంతోషపడిపోతారని ! పాలకులైన తెల్లవాళ్ళ భాష తమ పిల్లవాడికికూడా వచ్చిందన్న గర్వం. అది సహజం. పంథొమ్మిదవ శతాబ్ది చివరలో (1897లో) వ్రాయబడ్డ నాటకం అది. సురేంద్రనాథ బెనర్జీ ప్రస్తావనకూడా ఈ నాటకంలో ఉంది.

ఏమైనా ఆంగ్లవిద్య ప్రభుత్వోద్యోగాలకు భారతీయులను అర్హులను చేయడమే కాక, అంతవరకూ భారతదేశానికీ, పాశ్చాత్యప్రపంచానికీ మధ్య సాంస్కృతికంగా నిలిచిన అడ్డుగోడను ఒక్కదెబ్బకు పడగొట్టింది. సరియైన తరుణంలో పాశ్చాత్యభావాలతో మనకు పరిచయం కలిగింది. అది ఫ్రెంచి కాంతి కిరణాలు ప్రసరిస్తోన్న యుగం. యూరపు ఆలోచనారీతిలో హేతువాదానికీ, వ్యక్తి ప్రకర్షకూ ప్రాబల్యం వచ్చిన రోజులు.ముఖ్యంగా ఫ్రెంచివారి 'స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాత్రం' మన విద్యావంతులను విశేషంగా ఆకర్షించాయి. అంధవిశ్వాసం కన్న సహేతుకమైన జిజ్ఞాస, బయటి ప్రోద్బలం కన్న వ్యక్తి అంతరాత్మ ఉత్తమమైనవని మనవారికి తెలిసివచ్చింది. సాంఘికన్యాయం రాజకీయ స్వత్వములు వంటి విషయాలలో కొత్తభావాలు తెలుసుకున్నారు. ప్రపంచంలోని ఒక గొప్ప సాహిత్యమైన ఆంగ్ల వాఙ్మయాన్ని ఆస్వాదించగలిగారు. సైన్స్ చదువుకున్నారు. తమ గత చరిత్రను విమర్శనాత్మక దృష్టితో పరిశీలింపసాగారు. చరిత్ర, భూగోళం, సామాజికశాస్త్రం వంటి అనేక శాస్త్రాలు

చదివారు. నవజాగృతితోపాటు తమ భవిష్యత్తు విషయంలో కొత్త ఆదర్శాలు పెట్టుకొన నారంభించారు.

ఆంగ్ల విద్యావ్యాప్తివల్ల కలిగిన సత్ఫలితాలను గూర్చి నేను వ్రాయడం కన్న విజ్ఞుల అభిప్రాయాలను పాఠకుల దృష్టికి తేవడం సమంజస మనుకొంటాను. రైన్‌కోర్ట్ అనే పాశ్చాత్య రచయిత తాను రచించిన 'ది సోల్ అఫ్ ఇండియా' (The Soul of India) అనే గ్రంథంలో "ఆధునిక విద్య భారతీయ సంప్రదాయ విద్యకు పూర్తిగా భిన్నమైనది. నైతికావశ్యకతలు లేనిది. కాని అది అశోకుని కాలంనుంచి భారతదేశానికి లేనట్టిదానిని సంప్రాప్తింప జేసింది. అదే సాంస్కృతిక ఐక్యత. భాషాసంబంధమైన ఏకీకరణ, విద్యావంతులు స్వేచ్ఛగా విజ్ఞాన సంబంధమైన విషయాలను పరస్పరం తెలుసుకొనే అవకాశాన్ని కలిగించింది. భవిష్యత్తులో రాబోయే భారత జాతీయతాభావం ఆంగ్లభాషలో పుట్టి ఆంగ్లభాషలోనే అభివ్యక్తమైంది" అని వ్రాశాడు. ఇది చారిత్రిక సత్యం.

'ది రినైజాన్స్ ఆఫ్ హిందూయిజం' (The Renaissance of Hinduism) అనే గ్రంథ రచయిత ప్రొఫెసర్ డి. యస్. శర్మ ఇట్లా అభిప్రాయపడ్డారు: "హైందవ పునరుజ్జీవనానికి కారకమైన శక్తులలో ఆంగ్లవిద్యా వ్యాప్తి అన్నిటికన్నా ముఖ్యమైనది. అది భారతీయులు జ్ఞానవిషయకంగా, బౌద్ధికంగా ఇతరులనుంచి వేరుపడి ఉండటాన్ని తొలగించి, వారిని పాశ్చాత్య సాహిత్యం, విజ్ఞాన శాస్త్రాలు, చరిత్రవంటి విషయాలకు సన్నిహితులను చేసింది. దీని ఫలితంగా 15, 16 శతాబ్దాలలో ప్రాచీన ప్రామాణిక విద్యావిజ్ఞానముల పునరుద్ధరణవల్ల యూరపుజాతులు అనుభవించినటువంటి ఒక గొప్ప మానసిక వికాసం భారతదేశంలో సాధ్యమైంది. మన స్కూళ్ళలో, కాలేజీలలో చదివే యువతీ యువకులు సంభ్రమాశ్చర్యాలతో ఒక వినూత్న భావనాలోకాన్ని దర్శించారు."

విఖ్యాత చరిత్రకారుడు సర్దార్ కె. యం. పణిక్కర్ తన 'ఎ సర్వే ఆఫ్ ఇండియన్ హిస్టరీ' (A Survey of Indian History) అనే గ్రంథంలో ఈ విషయాన్నే చర్చిస్తూ "కొత్తవిద్యవల్ల భారతదేశం తిరిగి కోలుకొని జవం జీవం పుంజుకొంది. ఇంగ్లీషు చదువే లేకపోతే ఈ పునర్నవం సాధ్యమయ్యేది కాదు. పాశ్చాత్యుల వైజ్ఞానికాభ్యుదయం మనకూ కలిగేదే. కాని అది ద్వితీయం

వలె దిగువస్థాయికి చెంది ఉండేది. ప్రపంచ వైజ్ఞానిక కార్యకలాపంలో మనం స్వయంగా పాల్గొనడమనేది దూరపు ఆదర్శంగానే ఉండిపోయేది. ఇంగ్లీషు చదువును అభిమానించడంద్వారా భారతదేశం ప్రపంచ సమాజంలో భాగ స్వామిగా చేరింది'' అన్నాడు. పణిక్కర్ ఇంకొక విషయం కూడా చెప్పాడు. భారతదేశమంతటా ఆంగ్లవిద్య ప్రవేశ పెట్టబడకుండా ఉన్నట్లయితే ఆ విధంగా వచ్చే పునరుజ్జీవనం ప్రాంతీయ భాషను బట్టి రాష్ట్రానికొక తీరుగా ఉండేది. మార్పులు వచ్చేవే. కాని అవి అఖిల భారత ప్రాతిపదికపై ఉండేవి కావు. హైందవ సమాజం ఏకీకరింపబడుటకు బదులు, దేశంలో ఎన్ని భాషలున్నవో అన్ని యూనిట్లుగా దేశం విభజితమయ్యేది. అంటే యూరపు మాదిరిగా ఇక్కడా జరిగేది. ఆ ప్రమాదం రాకుండా దేశమంతటికీ వర్తింపజేసిన సార్వత్రిక విద్యా విధానం కాపాడింది.

ఆంగ్ల విద్యా ప్రభావమును గూర్చి ఆంధ్రదేశంలో నవయుగ ప్రవక్త అయిన కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ 'వివేక వర్ధని' (1875 అక్టోబరు సంపు. 2, సంచిక 1) పత్రికలో ఇట్లా వ్రాశారు: "పాశ్చాత్య విద్య దేశీయులపై అద్భుతంగా పని చేసిందని సర్వులూ అంగీకరిస్తున్నారు. ఇంగ్లీషు చదువువల్ల దేశీయుల రీతులలో, తీరులో, నడతలో, మర్యాదలో మరింత సంస్కారము, నాజూకుతనము వచ్చినవి. చాలామందిలో కాకున్నా కొందరిలో మూఢ విశ్వాసములు తొలగిపోయినవి. ఆ చదువు సరిగా చెప్పిన పట్టుల వారి నైతిక శక్తి సామర్థ్యములు పెంపొందినవి." కందుకూరి వీరేశలింగం పంతులుగారు తెలుగులో అన్ని నూతన ప్రక్రియలలో రచన చేయడానికి వారికి ఆంగ్ల సాహిత్యంలో మూలములేవో డా. కొత్తపల్లి వీరభద్రరావుగారు వారి థీసిస్ వ్యాసం 'తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం' (ఇది ముద్రిత గ్రంథము)లో వివరంగా కొన్ని అధ్యాయాలలో వ్రాసి ఉన్నారు.

శ్రీ కె. పి. ఎస్. మీనన్, ఐ. సి. యస్. (రిటైర్డు) పటేలు స్మారకో పన్యాసావళిలో ''భారత జాగృతి-సంస్కరణా? లేక విప్లవమా?'' అనే విషయంపై ప్రసంగిస్తూ చాలా చమత్కారంగా ఒక మాట అన్నాడు: "బ్రిటిషు వారు ఘోరమైన తప్పిదం చేశారు. భారతదేశంలో ఇంగ్లీషును బోధనా భాషగా ప్రవేశపెట్టి విద్యావంతులనూ మేధావులనూ తయారు చేశారు. భారతదేశంలో

పిల్లలు ఇంగ్లీషు పుస్తకాలు పుచ్చుకొని స్కూళ్ళకు పోవడం మొదలు కాబట్టే ఢిల్లీలో వైస్రాయి లేకుండా పోయాడు!'' ఈ మాటలో ఎంతో అర్థం ఉంది. ఇంగ్లీషు చదువుకొన్న భారతదేశ విద్యాధికులు ఒక మహోద్యమంతో ఇంగ్లీషు వారిని ఈ దేశంనుంచి వెళ్ళగొట్టారు అని మీనన్ భావం. నిజమే మరి. ఆంగ్ల విద్యావంతులైన ప్రముఖులే కదా నేషనల్ కాంగ్రెసు పెట్టి ఇంగ్లీషులో పెద్ద పెద్ద తీర్మానాలు వ్రాసి, రకరకాల ఉద్యమాలతో స్వాతంత్ర్య సమరాన్ని నడిపి, చివరకు ఇంగ్లీషు వారిని భారతదేశంనుంచి వెళ్ళిపోండి అన్నారు. అలా వారు వెళ్ళిపోయారు కూడా.

సైన్స్ ప్రధానమైన ఆంగ్ల విద్యా బోధనను సమర్థించడం ద్వారా అలనాడు రాజా రామమోహనరాయ్ ఎంత దూరదృష్టిని ప్రదర్శించాడో ఈదేశం స్వతంత్రమైనప్పుడు మనకు అవగతమైంది. భారత పునరుజ్జీవనోద్యమానికి ఆంగ్ల విద్య చేసిన మేలు అవిస్మరణీయమైనది.

ఆంగ్ల విద్య ద్వారా కలిగిన పాశ్చాత్య సంపర్కంవల్ల దేశంలో పాశ్చాత్య భావాలు వ్యాపించనారంభించాయి. మొదట ఈ రెండు సంస్కృతుల సంఘట్టనంవల్ల కొంత ఘర్షణ జరిగింది. ఆ స్థితిని రైన్‌కోర్టు అనే పాశ్చాత్య విద్వాంసుడు ఇట్లా వర్ణించాడు: ''బుద్ధి, వివేకముగల ఆసియావాసులను పాశ్చాత్యుల ఆధిక్యం తబ్బిబ్బుచేసింది. శాస్త్రీయ విజ్ఞానంలో, ప్రాథమిక పరిశోధనలో, సాంకేతిక పద్ధతుల ఉపయోగంలో, మిక్కుటమైన కళాత్మక సృజనలో, జీవంకల సాహిత్యంలో, జీవితంపై క్రియాశీలక దృక్పథంలో — ఇట్లా అనేక విషయాలలో పాశ్చాత్యులు తమకన్న భిన్నంగా ఉన్నట్లు ఆసియా వాసులు గమనించారు. మరి ఆసియా ప్రాచీన నాగరికతలన్నీ అస్థిపంజరాలైనవయ్యే! 19 వ శతాబ్ది తొలిదశలో పాశ్చాత్య ఆధిక్యమును ఆమోదించడం తప్ప ఆసియా ఖండంవారికి మరొక మార్గం లేకపోయింది. భారత జాగృతి అనే పరివర్తనకు శ్రీకారం చుట్టిన దూరదృష్టి కల భారతీయులు పాశ్చాత్యుల ప్రపంచ నిర్మాణ కార్యంలో పూర్తిగా సంలీనం కావాలన్న లక్ష్యంతోనే వ్యవహరించారు. అంత్యదశలో నున్న భారతీయ శరీరంలో మినుకుమినుకుమనే ఆధ్యాత్మికజ్యోతికి సంబంధించిన సన్నని వెలుగుతప్ప మరేమీ లేదు. ప్రాణంలేని గతాన్ని, తెలియని భవిష్యత్తుతో ముడిపెట్టగల ఈ సన్నని వెలుగే జాగృతికి

ఉత్పత్తిస్థానమైంది." అంటే- రైన్‌కోర్ట్ ఇచ్చట సంస్కారోద్యమాలతో కూడిన హైందవజాతీయోద్యమాన్ని ప్రస్తావిస్తున్నాడు.

అరవిందునికి మన పాశ్చాత్య సంపర్కంలో కొంత మంచి కనిపించింది. ''యూరపు జీవితము, దాని సంస్కృతితో కలిగిన సంపర్కము – ఇవి మనకవసరమైన మూడు ప్రేరణల నిచ్చాయి. పాశ్చాత్య సంపర్కం మనలో గుప్తంగా ఉన్న విజ్ఞాన సంబంధమైన, విచారణాత్మకమైన ఉత్సాహాన్ని పునరుద్ధరించింది. మన జీవితానికి పునరావాసం కల్పించి మనలోని నవ్యసృజనా ప్రతిభను మేల్కొల్పింది. పునర్జీవం పొందుతూ ఉన్న భారతీయ ప్రకృతిని నూతన భావాల, నూతన పరిస్థితుల ఎదుట నిల్పింది. వాటిని అవగాహన చేసుకొని, వాటిని అధిగమించవలసిన సత్వరావశ్యకతను మనకు నొక్కిచెప్పింది. జాతియొక్క బుద్ధివివేకములు గతసంస్కృతిని ఒక వినూత్నదృష్టితో అవలోకించాయి. ఆ సంస్కృతి సారాంశమును మననం చేసుకొని పరిస్థితి పూర్వాపరాలను గ్రహించాయి. ఇట్టి జాగృతినుండి, అంతర్దృష్టినుండి, ప్రేరణనుండి భారతీయపునరుజ్జీవనం ఉదయిస్తూ ఉన్నది...అయితే యధార్థమైన పునరుజ్జీవనం (కొత్తపుట్టుక) సంభవించాలంటే మొదట యూరోపియన్ సంపర్కాన్ని స్వీకరించాలి. రెండవకర్తవ్య మేమిటంటే యూరపు ప్రభావానికి భారతీయ ఆత్మ ప్రతిక్రియ జరపాలి. మూడవ దేమిటంటే నవ్యసృష్టికి అనివార్యమైన ఆధునిక భావాలను, ప్రక్రియలను, రూపాలను స్వీకరిస్తూనే భారతజాతి స్వకీయసత్యాలను తిరిగి సాక్షాత్కరింపజేసుకోవాలి'' అన్నాడు అరవిందుడు. భారతీయ ఆత్మ పరిరక్షింపబడాలని ఆయన ఆకాంక్ష. దాని పునః జాగృతియే ఆయన పరమాశయం.

కాని జవహరలాలునెహ్రూ దృష్టిలో పాశ్చాత్య సంపర్కం అతితీక్ష్ణమైనది. క్రియాశీలకమైనది. అది చలన రహితమైన సమాజానికి నవీన స్మృతి చైతన్యముల నిచ్చేది. మధ్యయుగాల ఆలోచనలు, అలవాట్లు ఉన్న సమాజం ఎంత సంస్కారం కలదైనా, ఎంత ముందంజ వేసినా స్వాభావికంగా నిర్దిష్టమైన పరిమితులు కలదగుటచే అది అభివృద్ధిని సాధింపలేదని నెహ్రూ అభిప్రాయం.

ఏమైనా పాశ్చాత్య సంపర్కం భారతీయుల ప్రజ్ఞకు పదును పెట్టి వారు తమ కర్తవ్యాన్ని గుర్తెరుగునట్లు చేసింది. అది భారతీయ నాగరికతను కొంత మిశ్రమం గావించినమాట నిజమే. అటువంటి సాంకర్యం జరగడం పూర్వం ఎప్పటినుంచో వస్తున్నది. ఇదికొత్తకాదు. అనివార్యంకూడా. కాని ఫలితాన్ని పరిశీలిస్తే ఎంతో సంతుష్టి జెందుతాము. ఒక్కొక్క రంగంలో ఎందరు మహా పురుషులు ప్రభవించారు ! ఎంత నూతన సృష్టి జరిగింది ! ఎంత చైతన్యం వచ్చింది ! 19 వ శతాబ్దిలో అంతటి మహాపరివర్తనం మనకు సాధ్యమైన దంటే యుగసంధిలో ఉన్న భారతదేశంపట్ల కాల పురుషుడు ఎంత ప్రసన్నుడై ఉండాలి ?

# 5. సంస్కరణోద్యమాలు

పునరుజ్జీవన మనబడే చారిత్రకపరివర్తనంలో మత సంస్కరణోద్యమాలు కూడా ఒక భాగమే. యూరపులో వచ్చిన రిఫార్మేషన్ (Reformation) మత సంస్కారోద్యమమే. భారతదేశ పరిస్థితుల దృష్ట్యా అది ఇక్కడ కూడా ఆవశ్యకమైంది. 18వ శతాబ్ది నాటికి మన దేశంలో సాంఘిక దురన్యాయం పరాకాష్ఠకు చేరుకొంది. బాల్యవివాహాలు, బహుభార్యాత్వము, వితంతువులను హీనంగా చూస్తూ వారికి పునర్వివాహ యోగ్యత లేకుండా చేయడం, స్త్రీలదుర్దశ, సతీ సహగమనం, మొక్కుబళ్ళ పేరుతో శిశుహత్యలు, నరబలులు, మూఢవిశ్వాసాలు, శుష్కమైన బాహ్యాచారాలు, కర్మకాండలు, అవినీతికరమైన తాంత్రిక పద్ధతులు, సంకుచితమైన కులవర్ణ విభేదాలు, అస్పృశ్యత, ఇంకా ఎన్నో దురాచారాలు భారతీయ సమాజాన్ని క్షీణదశకు తెచ్చాయి. ఈ ఆచారాల పీడనం వల్లనే గతంలో ఎందరో హిందువులు మహమ్మదీయులుగా మారి, మతాంతరులయ్యారు. క్రీస్తుశకం ఆరంభమైన కొద్దికాలానికే క్రైస్తవులు భారతదేశానికి వచ్చి కేరళ తీరప్రాంతంలో నివాసమేర్పరచుకున్నారు. కాని బ్రిటీషుపాలకులతో పాటు వచ్చిన క్రైస్తవము వీరక్రైస్తవము. అవకాశం దొరికితేచాలు, హిందూమతంలోని లోపాలను ఎత్తిచూపి, ఖండించి, ప్రజలమనస్సులను మార్చి మతాంతరీకరణకు పూనుకొనేవారు. బెంగాలులో, ఇతర ప్రాంతాలలో పెద్ద కుటుంబాల హిందువులే క్రైస్తవ మతం పుచ్చుకున్నారు. బ్రిటిషు వారి పాలనతో క్రైస్తవమిషనరీల ప్రచారం ఉధృతమైంది. వారు హిందూ మతమును అనేక దైవములను నమ్మి ఆరాధించే మతమని విమర్శిస్తూ తమ ప్రచార కార్యక్రమాలు సాగించేవారు. ఈ స్థితిలో హిందువులు ఆత్మ విమర్శ చేసుకున్నారు. క్రైస్తవాన్ని దృష్టియందుంచుకొని తమ మతసిద్ధాంతాలను పునర్విమర్శ చేసుకున్నారు. దేశపారతంత్ర్యాన్ని భరింపజాలనివారు మొదట తమ ఇల్లు చక్కబెట్టుకోవడం తమ కర్తవ్యమని గ్రహించారు. అది జరగాలంటే అజ్ఞానం, మూఢవిశ్వాసాలు, పూర్వాచారపరాయణత్వం, న్యూనతాభావం పోవాలి. అందుకే సంఘ సంస్కరణలు వచ్చాయి. యూరపులో 16వ శతాబ్దిలో వచ్చిన మతోద్ధరణం (Reformation) వంటి సంస్కారోద్యమాలు 19వ శతాబ్దిలో భారతదేశంలో విజృంభించాయి. ఇవి చాలా బలీయమైన

ఉద్యమాలు కాబట్టి త్వరితగతిని ప్రజలలోకి చొచ్చుకొనిపోయాయి. డా॥ పట్టాభి సీతారామయ్యగారు వారు వ్రాసిన కాంగ్రెసు చరిత్రలో "కాంగ్రెసు పుట్టడానికి యాభై యేళ్ళమునుపే, లేక ఇంకా అంతకు పూర్వమే జాతిని పునర్నవం గావించే పరివర్తనాయత్నం ఆరంభమై కార్యాచరణ మొదలైంది. రాజా రామమోహన రాయ్ కాలం నాటికే జాతి జీవితం బహుముఖంగా పొంగి పొరలుతూ ఉన్నది" అని వ్రాశారు.

భారతదేశానికి పాశ్చాత్యుల సంపర్కంవల్ల కలిగిన ఫలితాలలో మత సంస్కరణ ప్రధానమైనది కావడం ఒక చారిత్రక విశేషం. అయితే మన వారు మొదట తమ మతంకేసే ఎందుకు చూచారు అన్న ప్రశ్న వస్తుంది. దీనికి ఆచార్య జె. బి. కృపలానీ రచించిన 'గాంధి: హిజ్ లైఫ్ అండ్ థాట్' (Gandhi: His Life and Thought) అనే గ్రంథంలో సమాధానం లభిస్తుంది. ఆయన ఇట్లా వ్రాశారు: "పాశ్చాత్య సంపర్కం ఈ దేశంలో అప్పుడు నెలకొని ఉన్న భావాలనూ, ఆదర్శాలనూ, వ్యవస్థలనూ పునర్విమర్శించవలసిన అగత్యాన్ని కలిగించింది. మొదటి తాకిడి సహజంగానే మతరంగానికి తగిలింది. కారణమేమిటంటే భారతదేశీయుల భావాలు, ఆదర్శాలు, తత్త్వాలు, వ్యవస్థలు ఇంచుమించు మతానికి సంబంధించినట్టివి." హిందూ మత ప్రాథమిక సత్యాలను పునః ఉద్ఘాటించడానికై సనాతన హైందవములోనే నూత్న సంస్కారోద్యమాలు బయలుదేరాయి. ఇది మొదట మతానికే పరిమితమైంది. ఇతర మతాల వారికన్న హిందువులే మొదట బ్రిటిషువారి కొత్త విద్యావిధానాన్ని అవలంబించారు కదా! అరవిందుడు ఈ పరిణామం ప్రస్తావన తెచ్చి భారతీయుల మనస్సు, ఆత్మ మతవిచారానికే మొదటి ప్రాధాన్యమిస్తాయని చెబుతూ "భారతదేశంలో ప్రజా జీవితానికి సంబంధించిన మహోద్యమాలన్నీ ఒక నూతన ఆధ్యాత్మిక విచారముతో, భావనతో, సాధారణంగా ఒక కొత్త మత కార్యకలాపంతో ఆరంభమయ్యాయి. విజ్ఞానయుతము, హేతువాద బద్ధము, సర్వ సమభావయుతము, ఐహికము, ప్రాపంచికము, మత ప్రమేయ రహితము అయిన నవయూరపు ప్రభావం ఆదినుండీ భారతదేశంలో మత సంస్కరణ యత్నానికే కారకమైంది. భావాలనూ, సమాజాన్నీ పునర్నిర్మించే కృషి జరగాలంటే అది ఆధ్యాత్మిక ప్రాతిపదికపైన ఆరంభమై మతరూపంలో, మతోద్దేశములతో సాగవలెనని భారతీయుని అతని సహజజ్ఞానం ఉద్బోధిస్తుంది"

అని అన్నాడు. కనుక ప్రాచీన భారత సంస్కృతిని పునరుజ్జీవింపజేసి, దానిని ఆధునికం చేయడానికే సంస్కరణోద్యమాలు ఉద్దేశింపబడ్డవి. తమ సాంస్కృతిక వారసత్వాన్ని పాశ్చాత్య సాంస్కృతిక అఘాతములనుండి కాపాడుకోవలసిన ఆవశ్యకతను బుద్ధిజీవులైన భారతీయులు కొందరు గుర్తించారన్నమాట. అందుకు మొదట హైందవ సమాజంలో కాలగమనంలో పుట్టుకొచ్చిన రుగ్మతలను నివారించి, ప్రక్షాళనం చేయాలి. అందుకేసంస్కరణలు. ఈ సంస్కారోద్యమాలకు కూడా మార్గదర్శి రాజా రామమోహనరాయ్.

## బ్రహ్మ సమాజము

బ్రహ్మ సమాజమును గూర్చి చెప్పేముందు మత విషయాలలో రామమోహనుని అభిప్రాయాలను మనం గమనించాలి. ఆయన హిందూ మతాన్ని పూర్తిగా ఖండించి దానిని ధిక్కరించలేదు. ఆ మతంలో ప్రబలిన మూఢవిశ్వాసాలనూ, దురన్యాయాలనూ, మూర్ఖత్వమునూ ఖండించినాడు. మానవుడు కేవలం శాస్త్ర పురాణాదుల ప్రమాణంపైననే ఆధారపడియుండక,సహజవివేకంతో హేతువాదంతో అత్యున్నత సాధనకు పూనుకోవాలన్నాడు. సత్యాన్ని నిర్ధారణ చేయడంలో ఆయన మీమాంసా విధానం అవలంబించాడు. ''ఒక బాలుడు సహేతుకమైన విషయం చెబితే దానిని ఆమోదించాలి. కాని ఆ బ్రహ్మయే దిగి వచ్చి హేతుబద్ధంకాని మాట చెబితే దానిని గడ్డిపోచగా ఎంచి తిరస్కరించాలి'' అన్న వశిష్ఠుని ఉవాచను రాయ్ ఉదాహరించేవాడు. జీవాత్మ, పరమాత్మలే అన్ని మతాలకూ ప్రాథమిక సత్యమని ఆయన భావం. దైవం ఒక్కడే అన్న విశ్వాసం విషయంలో మానవాళి కంతటికీ ఏకాభిప్రాయమున్నదని ఆయన నిరూపించాడు. ఆ దైవానికి గుణాలను ఆపాదించినప్పుడే భేదాభిప్రాయాలు కలిగాయని అన్నాడు. ఆయన నిర్గుణ బ్రహ్మమునే ఆరాధించాడు. శాఖాభేదాలనూ, ప్రకృత్యతీత, అద్భుతవాదాలనూ, అవతార వాదాన్నీ ఆయన తిరస్కరించాడు. భగవంతుడు ప్రవక్తలద్వారా, మతగురువులద్వారా సామాన్యమానవులకు సందేశములు, ఉపదేశములు పంపుతాడన్న వాదాన్ని ఖండించాడు. మానవుని మోక్షమునకు ప్రవక్తలతో నిమిత్తమే లేదన్నాడు. విగ్రహారాధనను ఖండించి, ఏకేశ్వరోపాసనయే ఉపాదేయమన్నాడు. క్రైస్తవుల త్రిమూర్తి వాదమును (దేవుడు, దేవుని పుత్రుడు, దివ్యాత్మ అనే త్రినిటీరియనిజము-

Trinitarianism) బాహాటంగా విమర్శించి క్రైస్తవ మిషనరీలతో వాదోప వాదాలు జరిపాడు. మతం ప్రధానలక్ష్యం మానవుని శ్రేయస్సేనని ఉద్ఘాటించాడు.

రామమోహనరాయ్ తన మిత్రులతో మత సంబంధమైన చర్చలు జరిపే నిమిత్తమై 1815లో ఆత్మీయసభ స్థాపించాడు. చర్చలు ఎంతో స్వేచ్ఛగా జరిగేవి. కులాల పద్ధతినీ, బెంగాలీ బ్రాహ్మణులలో కులీనత్వమునూ, సహ గమనమునూ వారు ఖండించేవారు. వితంతు వివాహాలను సమర్థించేవారు. స్త్రీలకు తండ్రుల లేదా భర్తల ఆస్తిపై హక్కు ఉండవలెనని వాదించేవారు. ఆత్మీయ సభ మత సంస్కరణ భావాలకు ఒక వేదికగా ఉపకరించింది. 1827లో కల కత్తా యూనిటేరియన్ కమిటీ ఏర్పాటైంది. 1828 ఆగస్టు 20 తేదీన రామమోహనరాయ్ బ్రహ్మసభ స్థాపించాడు. దీనినే తరువాత బ్రహ్మసమాజం అని వ్యవహరించారు. అప్పటి బెంగాలీ సమాజంలో ప్రముఖులైన కొందరు దీనిలో సభ్యులుగా చేరారు. వారిలో రవీంద్రుని తాతగారైన ప్రిన్స్ ద్వారకానాథ టాగూరు ఒకడు. బ్రహ్మసభ ఒక కొత్త మతశాఖ కాదు. నిత్యుడు, నిరా కారుడు, శోధింపశక్యము కానివాడు, నిర్వికల్పుడు అయిన ఏకదైవముపై విశ్వా మున్నవారందరికీ ఈ సంస్థ సమావేశ కేంద్రంగా ఉండవలెనని రాయ్ ఆకాంక్ష. ప్రతి శనివారం సమావేశాలు జరిగేవి. వేదములనుండి, ఉపనిషత్తులనుండి సూక్తులు చదివేవారు. ఇద్దరు ఆంధ్ర బ్రాహ్మణులు వేదపఠనం చేసేవారు. కొందరు భక్తి గీతాలు పాడేవారు. ముస్లిం, క్రైస్తవ బాలురు కూడా వచ్చి ఆరబ్బీ, ఆంగ్ల భాషలలో దైవస్తుతి చేసేవారు.

బ్రహ్మసమాజంలో ఈశ్వరైక్యవాదానికే ప్రాముఖ్యం. మత సంప్ర దాయాల ప్రమేయం లేదు. అంతా ఏకేశ్వరోపాసకులు. ఈ సమాజంపై క్రైస్తవ భావనా స్రవంతి ప్రభావమున్నదని కొందరంటారు. ఈ సంస్థను గూర్చి అరవిందుడు చేసిన వ్యాఖ్యానం గమనింపదగింది: "బ్రహ్మసమాజమనేది ఒక విశాలమైన సర్వసమదర్శియైన ఉదారభావన. దానిలో ఇంగ్లీషు ప్రయో జకతావాదము (Utilitarianism) ను పోలిన వేదాంత సంబంధమైన ఉత్తేజ మున్నది. రవంత క్రైస్తవ ప్రభావమున్నది. మత సంబంధ హేతువాదము, వివేక వాదము పెద్ద మోతాదులో ఉన్నవి. దీని పెంపుకు చెందిన మూడు దశలూ హైందవ మతాదర్శాలైన జ్ఞాన, భక్తి, కర్మలవంటివి'' అన్నాడు అర

విందుడు. బ్రహ్మసమాజం భారతీయుల దృక్పథంలో అపారమైన పరివర్తనం తెచ్చిందని అంటూ డా. పెర్సివల్ స్పియర్ ''రామమోహనరాయ్ పాశ్చాత్య సాంస్కృతిక వారసత్వంలోనుంచి కొంత స్వీకరించడమేగాక ప్రాచ్యదేశాల భావాలను పాశ్చాత్య దేశాల భావాలతో అనుసంధానం చేసేందుకు ఒక సూత్రాన్ని కూడా సమకూర్చాడు. 1830 నుంచి 1880 వరకు—అంటే యాభై ఏళ్ళపాటు ఈ దృక్పథం నూతన భారతీయ మధ్యతరగతి వర్గంలో వ్యాప్తమై ఉంది'' అని వ్రాశాడు. అయితే బ్రహ్మ సమాజం హెచ్చుగా ఇంగ్లీషు చదువుకున్నవారిలో, మధ్య తరగతి కుటుంబాలలో మాత్రమే చోటు చేసుకో గలిగింది. రవీంద్రనాథ టాగూరు నవలలవల్ల ఈ అంశం తెలియవస్తుంది. ఇది ప్రజానీకంలోకి చొచ్చుకుపోలేదు. కాని దీని శాఖలు బెంగాలు వెలుపల ఇతర రాష్ట్రాలలో కూడా ఏర్పడ్డాయి. కేశవచంద్రసెన్ (1838-1884), దేవేంద్రనాథ టాగూరువంటి పెద్దలు బెంగాలులోను, రఘుపతి వెంకటరత్నం నాయుడు (1862-1939) వంటి సంస్కర్తలు ఆంధ్రలోను ఈ సమాజంద్వారా కొంత జాగృతి కలిగించారు. తరువాత దీనిలో చీలికలు వచ్చాయి. అయితే బ్రహ్మసమాజపు పరోక్ష ప్రభావందానితరువాత వచ్చిన భారత సంస్కారోద్యమా లపై చాలా ఉన్నది.

## ప్రార్థనా సమాజము

బ్రహ్మ సమాజ ప్రభావం మహారాష్ట్రలో 1849 లోనే కనిపించింది. 1867లో అక్కడ ప్రార్థనా సమాజం స్థాపించారు. దీని స్థాపనకు ముఖ్యులు జస్టిస్ మహాదేవ గోవింద రనడే (1842-1901), ఆర్. జి. భండార్కర్. రనడే 1861లో వితంతు వివాహ సమితిని నెలకొల్పాడు. ఈయన కలుగజేసిన ఉత్తేజం వల్లనే దక్కన్ ఎడ్యుకేషన్ సొసైటీ నెలకొన్నది. ఆయనకు మతము, సంఘసంస్కరణ రెండూ ఒకటే. ఒకదానినుంచి రెండవదానిని విడదీసి చూచే వాడుకాదు. సంస్కర్త అనేవాడు పూర్ణమానవుణ్ణి దృష్టిలో పెట్టుకోవాలిగాని ఏకముఖ సంస్కరణ సరిపోదని ఆయన ప్రబోధించాడు. అస్పృశ్యత, వితంతువుల పట్ల నిరాదరణ, స్త్రీ పురుషుల మధ్య అసమానత్వం, నిరక్షరాస్యత -ఇవి నిర్మూలింపబడవలెనని అన్నాడు. వితంతు వివాహాలను, అంతర్వర్ణవివాహాలను, సహపంక్తి భోజనాలను ప్రోత్సహించాడు. అనాధలకు ఆశ్రమాలు ఉండవలె

నన్నాడు. రాజకీయ సంస్కరణలు కావాలని కోరడానికై ఒక సంస్థను ఆరంభించాలన్న ప్రతిపాదన కూడా చేశాడు. ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి. ప్రార్థనా సమాజం కూడా పాశ్చాత్య హేతువాదంచే ప్రభావితమైంది. పశ్చిమ భారతంలో సంఘ సంస్కరణకు అది ఎంతో కృషి చేసింది. భారత జాతీయ కాంగ్రెసు వార్షిక మహాసభల సందర్భంగా సాంఘిక మహాసభను కూడా జరిపే ఆచారాన్ని రనడే మహాశయుడే ప్రవేశపెట్టాడు.

## ఆర్య సమాజము

దీని స్థాపకుడు స్వామి దయానంద సరస్వతి (1824-1883). ఈయన గుజరాతు దేశీయుడు. గొప్ప సంస్కృత పండితుడు. ఆంగ్ల విద్య నభ్యసించ లేదు. మహాతేజస్వి అయిన మహర్షి. హిందూమతంలోని కల్మషమును పోగొట్టటానికి కంకణం కట్టుకున్నాడు. "వేదాలకేసి పదండి" అని భారతీయులను ప్రబోధించాడు. మానవులందరికీ వేదాలను చదివే హక్కు ఉన్నదన్నాడు. వాటిని దేశీయ భాషలలో వ్రాయించాడు. వేదమత పునఃప్రతిష్ఠాపనకు కృతనిశ్చయుడయ్యాడు. వేదాలు మాత్రమే అపౌరుషేయములని చాటాడు. పురాణములు, తంత్రములు, వర్ణాలు, శాఖలు మొదలగువాటిపై ధ్వజమెత్తాడు. అస్పృశ్యులనేవారు లేరన్నాడు. విగ్రహారాధనకు ఆయన వ్యతిరేకి. భగవంతుడు ఒక్కడే, అనేకులు లేరన్నాడు. వితంతు వివాహాలనూ, స్త్రీవిద్యనూ సమర్థించాడు. భారతీయులు తమ సాంఘిక వ్యవస్థలో మార్పులు తెచ్చుకోలేకపోతే ఒక జాతిగా అగ్రశ్రేణిలో నిలబడజాలరని హెచ్చరించాడు. హైందవ మతానికి పూర్వపు నిర్మలత్వము, పవిత్రత తేవాలని ఈయన ఆకాంక్ష. ఈయన హైందవము పరిశుద్ధమైనదేకాదు, అధునాతనమైనది కూడా. ప్రాచీన వేదసూత్రాలను ఆధునిక జీవిత పరిస్థితులకు వర్తింపజేయ ప్రయత్నించాడు. చక్కని భాష్యకారుడు. "సత్యార్థ ప్రకాశ" అనే ఉద్గ్రంథం హిందీలో రచించాడు. వేద సత్యాలకు కొత్త భాష్యం చెప్పాడు. 1875లో ఆర్యసమాజమును స్థాపించి మహోధృతంగా ప్రచారం సాగించాడు. వాదప్రతివాదాలలో ప్రచండుడు. అయితే ఇక్కడ ఒక విమర్శనుకూడా పేర్కొనాలి. పాశ్చాత్య సంపర్కంవల్ల భారతీయ సంప్రదాయాలు తృణీకరింపబడుతూ, గతం నిర్లక్ష్యం చేయబడుతూ, విద్యావంతులు బౌద్ధికంగా పాశ్చాత్య సంస్కృతికి దాసులై, ఒక

మహోజ్జ్వల సంస్కృతిని చిన్నచూపు చూస్తున్నందుకూ, జాతీయతను రూపు మాపే ధోరణులు దేశంలో ప్రబలుతున్నందుకూ (బహుశా రామమోహనరాయ్ వైఖరిని, ఆంగ్ల విద్యాధికుల ధోరణిని దృష్టిలో పెట్టుకొని ఇట్లా ఆలోచించారను కుంటాను) ప్రతిగా ఆర్యసమాజం ఉద్భవించిందనికొందరు చరిత్రకారులు అంటారు. హిందువులు ఇతర మతాలలో చేరిపోవడం చూచిన దయానందుడు వ్యధితమన స్కుడై 'శుద్ధి' అనే కార్యక్రమంద్వారా తిరిగి వారిని హిందూమతంలో చేర్చుకున్నాడు. ఇస్లాం, క్రైస్తవ మతాల ప్రభావాలకు ప్రతిగా ఆర్యసమాజం ఆవిర్భవించిందని చెప్పవచ్చు. పాశ్చాత్యభావాలు, 'మ్లేచ్ఛుల ప్రాబల్యం', వీర క్రైస్తవం, యూరపు ప్రాబల్యం-వీటిపై తిరుగుబాటే ఆర్యసమాజం రూపంలో వ్యక్తమైంది. ఇది చాలా ఉద్రేక స్వభావంగల సంస్థ. పంజాబు మొదలు ఆంధ్ర ప్రదేశ్‌వరకూ ఈ సంస్థ విస్తరించి, హైందవులలో అపూర్వ చైతన్యం కలిగించింది. బ్రహ్మసమాజం వలెకాక ఆర్యసమాజం ప్రజానీకంలోకి ప్రచండమైన తీవ్రతతో చొచ్చుకొనిపోయి దేశీయులను ఉత్తేజపరచింది. ప్రజలలో దేశభక్తిని పెంపొందించి స్వాతంత్ర్యోద్యమ వీరులను తయారుచేసింది. 1857 తిరుగుబాటు తర్వాత హైందవ సమాజం విచ్ఛిన్నమైపోవనుండగా ఆర్య సమాజం దాని ఏకత్వమును నిలబెట్టగలిగింది. ఈ సమాజం కార్యకలాపాలు రాజకీయరంగానికి కూడా విస్తరించి జాతీయోద్యమానికీ, స్వాతంత్ర్య సమరానికీ చేయూతనిచ్చాయి. ఎందరో స్వాతంత్ర్య యోధులు ఆర్య సమాజానికి చెందిన వారై ఉండడం గమనింపదగిన అంశం.

## రామకృష్ణ మిషన్

19వ శతాబ్దిలో భారతదేశంలో జన్మించిన మహనీయులలో రామకృష్ణ పరమహంస (1836-1886) ఒక అపూర్వ అద్భుతవ్యక్తి. బెంగాలులో ఒక బ్రాహ్మణకుటుంబంలో జన్మించాడు. ప్రాచ్యవిద్యగాని, పాశ్చాత్యవిద్యగాని అంతగా లేవు. కలకత్తా సమీపమున దక్షిణేశ్వరంలో ఒక ఆలయంలో పూజారిగా ఉండేవాడు. కాని ఏకాంతముగా అద్వితీయమైన ఆధ్యాత్మిక జీవితం గడిపాడు. సకల మతములలోని అంతర్గత సత్యముపట్ల ఆయనకు ప్రగాఢ విశ్వాసముండేది. రామకృష్ణుని ఉదారస్వభావం, ధ్యానము, ఆధ్యాత్మిక చింతనము ఎందరినో ఆకర్షించాయి. తనను దర్శించిన వారికి చిన్న చిన్న నీతికథలతో మానవ

జీవిత పరమార్థమును గూర్చి చెప్పేవాడు. ఏ మతం పట్లా ఆయనకు విరోధం లేదు. కొన్ని విశ్వాసములకు అంటిపెట్టుకొని ఉండడమే మతం కాదనీ, పవిత్రము, ఆధ్యాత్మికము అయిన జీవితం గడపడంలోనే మత సారాంశము ఇమిడి ఉన్నదనీ ఆయన అభిప్రాయం. లోకులు ఆయనను గూర్చి ఆదర్శమూర్తి అనీ, అవతారమూర్తి అనీ చెప్పుకొనేవారు. జ్ఞాన భక్తి వైరాగ్యములు, ఔదార్యము, విశ్వమానవ సేవాభిలాష ఆయన యందు మూర్తీభవించి ఉండేవి. అఖండ పరిపూర్ణుడు. ఆయన జీవితమే ఒక దివ్యజ్యోతి. "నేను ఇచ్చట ఏ వ్యక్తి యొక్క మూర్తిని గూర్చి ప్రస్తావిస్తున్నానో ఆయన 30 కోట్ల ప్రజల రెండువేల యేండ్ల ఆధ్యాత్మిక జీవిత ఫలసిద్ధి" అని రామకృష్ణుని జీవిత చరిత్ర రచించిన ఫ్రెంచి విజ్ఞాని రోమారోలా అన్నాడు. ఆయన శిష్యులలో వివేకానందుడు (1863-1902) అగ్రగణ్యుడు. ఆయన అసలు పేరు నరేంద్రనాథ దత్త. కలకత్తా విశ్వవిద్యాలయ పట్టభద్రుడు. ఆయన వ్యక్తిత్వ మనన్య సామాన్యము. చక్కని ఆకృతితో తేజోవంతుడుగా కన్పించేవాడు. ఆయనను ఒకమారు దర్శించినవారు ఆయన రూపమునుగాని, వాక్చమత్కృతినిగాని మరిచేవారుకారు. వివేకానందుడు రామకృష్ణుని సందేశమును భారతదేశమంతటా సంచారము చేసి వ్యాపించేశాడు. జవ ముడిగి తేజస్సును గోల్పోతూ ఉన్న హైందవ మతానికి ఈయన బలవర్ధకౌషధం వలె ఉపయోగపడ్డాడు. ఈయన ప్రబోధములవల్లనే హిందూమతం తిరిగి తలయెత్తుకొని సగర్వంగా నిల్చొనగలిగింది. ఎంతగానో పునరుద్ధరింపబడింది. 1893 లో అమెరికాలోని చికాగో నగరమున జరిగిన అఖిల ప్రపంచ మహాసభలో పాల్గొని హైందవ ధర్మ విజయధ్వజస్థాపన మొనర్చాడు. ఒక సంవత్సరానికిపైగా అమెరికాలో ఉండి, ఆ పిమ్మట యూరపులో పర్యటించి ఏథెన్స్, కానిస్టాంటినోపుల్ నగరములు సందర్శించి, అక్కడినుంచి ఈజిప్టు, చీనా, జపాను దేశాలకు కూడా వెళ్ళాడు. ఎన్ని దేశాలు తిరిగినా పాశ్చాత్యమాయ ఆయనను ఆకర్షించలేదు. పాశ్చాత్యుల సంస్కృతిని ఆయన నిశితంగా విమర్శించాడు. భారతీయ తాత్త్విక ఆధ్యాత్మిక ఆదర్శాల పట్ల ఆయనకు గల విశ్వాసం మరింత దృఢమైనది. భారతీయతత్త్వమును పునరుద్ధరించినవాడాయన. భారతీయ సమాజంలో ఆధునికతను ప్రవేశపెట్టజూచిన సంస్కర్త కూడా ఆయనే. భారత ఆధ్యాత్మిక సంపదను గూర్చి ప్రతిభావంతముగా సకల దేశాల శ్రోతలకు ఆయన

చెప్పిన తీరు భారత పునరుజ్జీవనోద్యమం యొక్క విజయమని దేశదేశాల విజ్ఞులు ఆయనకు నివాళులర్పించారు. ఆయన వంటి వక్త మరిలేడు. ఆయన ప్రవచనములు ఇవి: "సర్వధర్మ సమన్వయ రూపమే వేదాంతము. ఆత్మ నిత్య శుద్ధము; జనన మరణాతీతము. భగవద్దర్శనము లభించుటకుముందు అహంకారము నశింపవలెను. భౌతికశాస్త్ర దృష్టితో చూచినను ఏకత్వమే—అద్వైతమే సిద్ధాంతమని నిశ్చయింపనగును. మానవుని పాపియనుటకంటె మహా పాపము మరియొకటిలేదు. అతడు అమృత పుత్రుడు. సర్వేశ్వరుని చేరు మార్గములను ప్రకటించుటయే వేదశాస్త్రముల ముఖ్యోద్దేశము. ప్రార్థనలు, కర్మ కలాపములు చిత్తశుద్ధికిని, ప్రతిమారాధనము ధ్యానమునకును తోడ్పడును. ధర్మ మనునది పూర్వపక్ష సిద్ధాంతములతోడను, గ్రంథములతోడను కూడిన విషయముకాదు. సాక్షాత్కారమే ధర్మతత్త్వము."* దేశకాలాద్యతీతమగు సనాతన ధర్మమే వివేకానందుడు ప్రదర్శించిన హిందూమతము. వేద వేదాంత సందేశామృతము నొసగి ప్రాచ్యపాశ్చాత్య ప్రపంచముల నుజ్జీవింపజేసిన కర్మయోగి స్వామి వివేకానందుడు.

వివేకానందుడు 1897లో రామకృష్ణ మిషను స్థాపించాడు. దానిని స్థాపిస్తూ ఆయన తన సహచరుల నిట్లా ఉద్బోధించాడు. ''మత ధర్మముల నుద్ధరించుటే మన ధర్మమని గ్రహింపుడు. ప్రతి జీవియు సాక్షాద్భగవత్స్వరూపమని గ్రహించి దరిద్రనారాయణుల నర్చించు విధానము మనము లోకమునకు చూపవలసియున్నది. భారతదేశమున నూతన సన్న్యాస సంప్రదాయమును స్థాపించుటయే నా జీవితోద్దేశము. జనసామాన్యము నుద్ధరించుటకై జీవితమును ధారపోయుటే యీ సన్న్యాసుల కర్తవ్యము.'' దీని వల్ల రామకృష్ణ మఠమును నెలకొల్పుటలో వివేకానందుని ఉద్దేశము విశదమైనది. అది మానవసేవ. రామకృష్ణ పరమహంస ఒకమారు తన శిష్యులతో "భగవంతుని వెదకుచున్నారా ? అయితే భగవంతుని మానవునిలో దర్శించండి. దివ్యత్వమనేది మరియే ఇతర వస్తువు కన్నను మానవునిలో మూర్తీభవించి ఉన్నది'' అని అన్నాడు. కనుక మానవ సేవయే మాధవసేవ అన్న ఆయన సూక్తిననుసరించి ఆపన్నులకు, దీనులకు సేవ చేయడం రామకృష్ణ మిషను ముఖ్య లక్ష్యం. రాజకీయాలతో ఈ సంస్థ కెట్టి

*శ్రీ చిరంతనానందస్వామి రచించిన 'వివేకానంద జీవిత చరిత్ర' నుండి.

సంబంధమూ లేదు. మతాంతరీకరణ దీని పనికాదు. జనులకు శ్రేయోదాయక మైన విద్యలు నేర్పడానికి తగిన వారిని సిద్ధం చేయడం, దేశీయకళలను పరిశ్రమలను వృద్ధిచేయడం, వేదాంతాది మతాభిప్రాయాలు జన సామాన్యమున కందజేయడం-ఇవి రామకృష్ణ మిషను ఆదర్శాలు. వీరు మానవసేవను ఏదో ధర్మకార్యంగా, వదాన్యతగా ఎంచిచేయరు. మత ఆధ్యాత్మిక జీవనంలో వారికి అదొక ఆవశ్యకమైన ధర్మము; ఒక శిక్షణ; ఒక నీతిని పాలించడము. ఈ మిషను శాఖలు ప్రపంచమంతటా ఉన్నవి. వీరు పాఠశాలలు, ఆసుపత్రులు నడుపుతూ బాధితులైన మానవులకు సేవ చేస్తూఉంటారు.

వివేకానందస్వామి భారత పునరుజ్జీవనానికి తోడ్పడిన వైనంలో ఒక విశిష్టత ఉన్నది. ఆధునిక కాలంలో భారతదేశ గత వైభవమును గూర్చి, ఈ దేశ సంస్కృతి నాగరికతల శ్రేష్ఠతను గూర్చి, హైందవ సమాజ మహత్వమును గూర్చి ఆయన శ్రోతలమనస్సులో నాటుకొనే విధంగాచెప్పాడు. పాశ్చాత్య నాగరికతను చూచి కన్నులు చెదరి ఆయన బెదరిపోలేదు. ఆ నాగరికతను అనుకరించి వారికి దాసులు కావద్దని ఆయన భారతీయులను హెచ్చరించాడు. దాని లోపాలను బహుధా వ్యక్తం చేశాడు. తన జీవితమంతా ప్రబోధాత్మకమైన దేశాభిమానోద్దీపకమైన ప్రసంగములుచేసి, హైందవ జాతిని ఉద్రూతలూగించి, భవిష్యత్తుపట్ల ఆ జాతికి ఆశాభావాన్ని కలిగించాడు. జాగృత భారత మహోన్నతాదర్శాలకు ప్రతినిధిగా వ్యవహరించాడు. ఆయన జీవితకథ ఖండాంతర వాసులను కూడా ప్రభావితులను చేసింది. కాబట్టే సర్ వెలెంటిన్ షిరాల్ ఆయన వ్యక్తిత్వమును ప్రస్తుతిస్తూ "భారత ప్రాచీన నాగరికతకు విదేశాలలో పరిగణన సంపాదించగలిగిన వ్యక్తిత్వంకల ప్రథమ హైందవుడు ఆయన. తమదొక ప్రత్యేక జాతి అని చెప్పుకోగల భారతీయుల ఆశయానికి మన్నింపు, మాన్యత తెచ్చిన మహాపురుషుడు'' అన్నాడు.

## దివ్యజ్ఞాన సమాజము

ఈ సమాజాన్ని మేడం హెచ్. పి. బ్లావట్స్కీ (1831-1891) కర్నల్ హెచ్. ఎస్. ఆల్కాట్ (1832-1907) 1875 లో మొదట అమెరికాలో స్థాపించారు. 1879లో వారు భారతదేశానికి వచ్చారు. 1886లో మద్రాసులోని అడయార్‌లో వారి ప్రధాన కార్యస్థానాన్ని ఏర్పాటు చేశారు. శ్రీమతి అనిబిసెంట్ (1847-1933) ఈ సమాజంలో చేరడంవల్ల

దివ్యజ్ఞాన ఉద్యమం భారతదేశంలో బాగా వ్యాప్తమైంది. అనిబిసెంట్ కృషి ప్రధానంగా హైందవ పునరుద్ధరణోద్యమం. భారతదేశ సమస్యల పరిష్కారానికి ఈ దేశ ప్రాచీన వ్యవస్థలనూ, ఆదర్శాలనూ పునరుద్ధరించడమే సరియైన మార్గమని అనిబిసెంట్ అభిప్రాయం. 1893లో ప్రకటితమైన తన స్వీయ చరిత్రలో తన అభిప్రాయాన్ని ఆమె ఇట్లా వ్యక్తం చేసింది: ''భారతదేశంలో జరుగవలసిన పనులలో మొదటిది ప్రాచీన మతముల పునరుద్ధరణ; వాటిని తిరిగి శక్తివంతముచేసి అభ్యున్నతికి తేవడం. ఇందువల్ల ఒక క్రొత్త ఆత్మగౌరవం, గతాన్ని సగర్వంగా చెప్పుకోగల ఆత్మవిశ్వాసం, భవిష్యత్తుపై నమ్మకం ఏర్పడగలవు. ఫలితంగా దేశభక్తి భావం ఎల్లెడలా వ్యాపించి జాతి పునర్నిర్మాణానికి అంకురార్పణ జరిగింది.'' అని వ్రాసుకొన్నది. ఈ ఆదర్శసాధనకై ఆమె బెనారసులో సెంట్రల్ హిందూ హైస్కూలును ప్రారంభించి దానిని కాలేజీగా వృద్ధి పరచింది. తరువాత ఆ కాలేజీనే ముఖ్య కేంద్రముగా చేసుకొని పండిత మదనమోహన మాలవ్యా (1861-1946) నిర్విరామ కృషితో 1916లో బెనారస్ హిందూవిశ్వవిద్యాలయం నెలకొల్పాడు. భారతీయ శాస్త్రాల ప్రాచుర్యానికీ, ఆధునిక విద్యను బోధించడానికీ ఈ విశ్వవిద్యాలయం చేసిన సేవ పేర్కొనదగింది.

భారత ప్రాచీన ఆదర్శాలను, వ్యవస్థలను పునరుద్ధరించి వాటిని తిరిగి శక్తివంతము చేయడం వల్లనే భారతీయుల సమస్యలు పరిష్కారమవుతాయని దివ్యజ్ఞాన సమాజంవారు భావించారు. అన్ని మతములూ ఒకే మూలమునుంచి ఉద్భవించాయనీ, కాబట్టి మానవుని మోక్షానికి ప్రత్యేకమార్గమనబడే ఏ ఒక్క మతమూ లేదనీ, మానవులందరిలోనూ ఘనత ఉన్నది కాబట్టి విశ్వమానవ సౌభ్రాత్రము ఒక సత్యమనీ వారి విశ్వాసం. మానవుని మరణం తరువాత ఆవలి జీవితాన్ని గూర్చి థియాసఫిస్టులు కొంత భోగట్టా సేకరింపగలిగారని కొందరంటారు. ఆ భోగట్టానుబట్టి వారు కొన్ని సిద్ధాంతాలను రూపొందించారని కూడా చెప్పబడుతూవుంది. దివ్యజ్ఞానం విషయంలో వారికి తిరుగులేని విశ్వాసం ఉన్నది. కుల మత జాతి వివక్షత లేకుండా ఈ సమాజం వారు అందరికీ సేవ చేస్తారు. భారత సంస్కృతిని వ్యాప్తం చేయడంలో వీరి పాత్ర గణనీయమైనది. అయితే విద్యాధికులూ, చింతనాపరులే ఈ సమాజంలో ముఖ్యులు కావడంవల్ల ఇది ప్రజలలో వ్యాప్తిచెందలేదు. కాని విద్యావంతులలో ఈ సమాజం కొన్ని తాత్త్విక

ఆదర్శాలనూ, సృజనాత్మక ఉత్తేజమునూ, ఉజ్జ్వలమైన చైతన్యాన్నీ కలుగజేసింది. అంతర్జాతీయ సౌభ్రాత్రభావాన్ని పెంపొందజేసింది.

## ముస్లిం జాతీయత

19వ శతాబ్దిలో భారతదేశంలో తొలుత విజృంభించినది హైందవ జాతీయోద్యమం. అది మొదట మతపరమైనది. ముస్లిములు ఆంగ్లవిద్యకు దూరంగా ఉండడంచేత కొత్త భావాలు వారిని తాకలేదు. బౌద్ధికమైన అలజడి వారిలో రాలేదు. కొన్ని దశాబ్దాల తరువాత వారి చైతన్యం ముస్లిం జాతీయతగా రూపొందింది. దేశంలో హిందువులు అధిక సంఖ్యాకులు కాబట్టి ఇస్లాం సంప్రదాయాలు సంస్కృతి ఏమవుతాయోనన్న ఆదుర్దా వారికి ఉండేది. ఆ దశలో సర్ సయ్యద్ అహమద్ ఖాన్ (1817-1898) అనే సంస్కర్త వారిని ఉద్ధరించాడు. ఆయన విద్యావేత్త. ఆధునిక విద్యాగంధము లేకపోవడంచేత ముస్లిములు చాలా నష్టపోయారనీ, ఎంతో వెనుకబడి ఉన్నారనీ ఆయన గ్రహించాడు. హిందువులలో విద్యావేత్తలు, సంస్కర్తలు చాలా ముందుగానే బయలుదేరి కృషి సల్పడంవల్ల వారు ముందుగానే పునరుజ్జీవనాన్ని అందుకోగలిగారు. సర్ సయ్యద్ ముస్లిముల అభివృద్ధికి ఆధునిక విద్య, విజ్ఞాన శాస్త్రబద్ధమైన వైఖరి అవసరమని గ్రహించి, విజ్ఞానశాస్త్ర సమితిని (Scientific Society) స్థాపించాడు. ఆ సమితి పాశ్చాత్య సాహిత్యమును విజ్ఞానమును భారతీయులకు అందజేసే కృషి సల్పింది. సర్ సయ్యద్ 1875లో అలీగఢ్‌లో ముస్లిం ఆంగ్లో ఓరియంటల్ కాలేజీ స్థాపించాడు. దీనికి నిధుల కోసమై ఆయన జోలెపట్టి యాచించాడు. ఆ కాలేజీయే తరువాత అలీగఢ్ ముస్లిం విశ్వవిద్యాలయమైంది. ఆయన మహమ్మడన్ ఎడ్యుకేషనల్ కాన్ఫరెన్స్‌ను కూడా వ్యవస్థీకరించాడు. సర్ సయ్యద్ గొప్ప ఆలోచనాపరుడు. ఆయన బ్రిటిషువారితో సహకరించిన మాట నిజమే. అప్పటి పరిస్థితులలో భారతీయులకు అదొక్కటే మార్గమని ఆయన మనస్ఫూర్తిగా విశ్వసించాడు. తాను భారత జాతీయ కాంగ్రెసుకు దూరంగా ఉన్నాడు. తన మతస్థులను కూడా ఆ సంస్థకు దూరంగా ఉండమన్నాడు. జాతీయోద్యమంలో చేరితే తనకు ప్రాణ సమానమైన ముస్లిములలో విద్యావ్యాప్తి కార్యక్రమానికి బ్రిటిషు అధికారుల సహాయం లభించదేమోనని ఆయన సందేహం. అయితే సర్ సయ్యద్ హిందూద్వేషికాడు. ఏ మతమైనా కాలానుగుణంగా సమాజ అవసరాలను తీర్చుటకు సంసిద్ధం కావాలని

అన్నాడు. పరదా ఆచారాన్ని విడనాడమన్నాడు. కొరానుకు వ్యాఖ్య వ్రాశాడు. ఆయన గొప్ప సాహితీవేత్త. చక్కని శక్తిమంతమైన శైలిలో ఉర్దూ వచన రచన చేశాడు. ఆయన వ్యక్తిత్వము, భావాలు భారత ముస్లిములను చాలా ప్రభావితం చేశాయి. ఎందరో ముస్లింమేధావులు ఆయనవల్ల ఉత్తేజితులై తమ సమాజాభివృద్ధికి కృషిచేశారు. అలీగఢ్ విద్యా సంస్థ భారత ముస్లిములలో ఎంతో జాగృతిని కలిగించింది. సర్‌సయ్యద్ జన్మించింది దేశం క్షీణదశలో ఉన్న కాలంలో. కాని చనిపోయేనాటికి తన సమాజాన్ని వెలుగులోకి తెచ్చి దానికి పునరుజ్జీవనం కలుగజేశాడు.

ఈ సందర్భంలో డా. సర్ మహమ్మద్ ఇక్బాల్ (1873–1938) అను మహా కవిని స్మరింపవలసి ఉన్నది. ఆయన పశ్చిమ పంజాబులోని సియాల్ కోటలో జన్మించాడు. యూరపు పర్యటనవల్ల ఆయనభావాలలో కొంతపరివర్తనం కలిగింది. మొదట "సారే జహాఁసె అచ్ఛాహిందూస్తాన్ హమారా" వంటి దేశభక్తి పూరితమైన జాతీయకవితలు రచించాడు. ఉర్దూ, ఫారసి భాషలలోవీనుమిగిలినకవి. బహుభాషావేత్త. మేధావి. అధ్యాపకుడు. తాత్త్వికుడు. రాజనీతిజ్ఞుడు. 1930లో ముస్లింలీగు వార్షిక మహాసభకు అధ్యక్షుడైనాడు. భారతఉపఖండ పశ్చిమోత్తర ప్రాంతంలో ముస్లిములకు పాకిస్తాన్ అనబడే ప్రత్యేక రాజ్యం ఏర్పడాలన్న వాదాన్ని బలపరిచాడు. ఏమైనా తన బహుముఖ ప్రజ్ఞచే తన తరంవారిని ప్రభావితం చేసిన వ్యక్తి. తన అవసానదశలో జవహరలాలు నెహ్రూ గొప్పదేశభక్తుడని ఇక్బాల్ ప్రశంసించాడు.

## ఇతర సంస్థలు

గోపాలకృష్ణ గోఖలే (1866-1915) 1905లో సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ స్థాపించాడు. భారతదేశ సేవకు జాతీయ బోధకులను తయారుచేయడం, రాజ్యాంగ పద్ధతులద్వారా భారత శ్రేయస్సౌభాగ్యాలను పెంపొందించడం ఈ సొసైటీ లక్ష్యం.

శ్రీ రామ్ బాజపాయ్ 1914లో బోయ్‌స్కౌట్స్ అసోసియేషన్ స్థాపించాడు. ఇది బాల భటుల ఉద్యమం. ఇది మానవ సేవకూ, జీవకారుణ్యమునకూ అంకితమైన సంస్థ.

భారత స్త్రీ జనోద్ధరణ విషయంలో రమాబాయి రనడే, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ (1820-1891) గారలు చేసిన కృషి స్మరణీయమైనది. 1923 లో

విమెన్స్ ఇండియన్ అసోసియేషన్ స్థాపించబడింది. స్త్రీలకు ఓటు హక్కు విషయంలో శ్రీమతి అనిబిసెంట్, శ్రీమతి సరోజినీనాయుడు (1879-1949)వంటి వారల కృషి ఫలితంగా 1935 సంవత్సరపు భారత ప్రభుత్వచట్టం భారత స్త్రీలకు రాజకీయ హక్కులు ఇచ్చింది. మహర్షి డి.కె. కర్వే (1858-1962) కృషి ఫలితంగా పూనాలో 1916లో మహిళా విశ్వవిద్యాలయం నెలకొన్నది. ఇది తరువాత 1936 లో బొంబాయికి మార్చబడింది. అఖిల భారత మహిళాసభ ఏర్పాటైంది.

దళిత జాతుల స్థితిగతులను మెరుగుపరచడానికై 1906లో డిప్రెస్డ్ క్లాసెస్ మిషన్ సొసైటీ స్థాపించబడింది. అస్పృశ్యతా నివారణకు చర్యలు మొదలైనవి. కేరళలో శ్రీ నారాయణగురు (1856-1928) 1870 లో శ్రీ నారాయణ గురు ధర్మపరిపాలనాయోగం(ఎస్. ఎన్. డి. పి. యోగం) అనే సంస్థను స్థాపించి, అస్పృశ్యుల అభ్యున్నతికి పూనుకున్నాడు. ఆయన అస్పృశ్యుడు. ''మానవులకు ఒకటే మతం, ఒకటే కులం, ఒక్కడే దేవుడు'' అని చాటిన మహితాత్ముడు. అంటరానివారు అనబడేవారికి హరిజనులని పేరుపెట్టి గాంధీజీ వారి అభ్యుదయానికెంతో పాటుపడ్డాడు. వారి రాజకీయ హక్కులకోసం డా. బి. ఆర్. అంబేద్కర్ (1893-1956) కృషిచేశాడు.

ఈ విధంగా భారతదేశంలో వివిధవర్గాల శ్రేయస్సు నిమిత్తమై అనేక సంస్థలు వెలసి వారివారి అభ్యున్నతికి కృషి చేశాయి

ఈ సంస్కరణోద్యమాల ఫలితంగా పరిపాలనా విషయకంగా కొన్ని సత్ఫలితాలు కలిగాయి. సంఘ సంస్కర్తల ఆందోళనను పురస్కరించుకొని ప్రభుత్వం కొన్ని చట్టాలను ప్రవేశపెట్టింది. 1829లో సహగమనం నిషేధింపబడింది. 1795, 1802 సంవత్సరముల నిబంధనలద్వారా శిశుహత్యను నిషేధించారు. 1843లో బానిసత్వం నిషేధింపబడింది. 1847-1854 సంవత్సరాల మధ్య నరబలులు అరికట్టబడ్డవి. మతము, ఆచారాల పేరిట వీధులలో ఏర్పాటు చేయబడుతూ ఉండే అసభ్యకరమైన ప్రదర్శనములు 1855లో నిషేధింపబడ్డవి. 1856లో వితంతు వివాహాలను చట్టబద్ధం చేయడం జరిగింది. 1891లో ఏజ్ ఆఫ్ కన్‌సెంట్ ఆక్టు ప్రవేశపెట్టబడింది. 12 సంవత్సరాల లోపు బాలికలతో సంభోగమును నిషేధించి, 1930 సవరణ చట్టంద్వారా సంగ

మానికి బాలికల వయస్సును 14 సంవత్సరాలకు పెంచడం జరిగింది. సివిల్ వివాహాల చట్టం 1872లో ఆమోదింపబడింది. ఈ విధంగా సంఘంలోని చెడు పద్ధతులను తొలగించి ప్రక్షాళనం చేయడం జరిగింది.

భారతదేశంలో 19వ శతాబ్దిలో వచ్చిన సంస్కరణోద్యమాల వల్ల ఒక మహత్తర ప్రయోజనం చేకూర్చింది. వాటివల్ల దేశంలో ఒక గొప్ప చైతన్యం కలిగింది. ఇది మతపరమైన ఉద్యమ మగుటవల్ల ఆ చైతన్యం కుటుంబాలలోకి సైతం చొచ్చుకొనిపోయింది. చదువులేనివారూ, చదువుకొన్నవారూ అంతా రావలసిన మార్పును తెలుసుకొన్నారు. హిందువులు తమ మతంలో ప్రవేశించిన కాలుష్యాలను తెలుసుకొని వాటిని పరిహరించడానికి సంసిద్ధులయ్యారు. అవి పోతేనేకాని లేకపోతే సమాజం ముందుకు పోలేదని గ్రహించారు. అర్థంపర్థంలేని ఆచారాలకు విలువ నశించిరిది. వ్యక్తులలో సంస్కారదృష్టి ఏర్పడింది. భారత సంస్కృతి పట్ల భారతీయుల కేర్పడిన నిరాదరణ తొలగిపోయి, ఆ సంస్కృతి గొప్పదనం తెలియవచ్చింది. దాని పరిరక్షణకు, పెంపుకు నడుము కట్టారు. పాశ్చాత్య సంస్కృతిలోని ఉత్తమ అంశాలను స్వీకరించడానికి ఉద్యుక్తులైనారు. పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రమును, రాజకీయ సాంఘిక భావాలను ఆమోదించి వాటిని తమ సమాజ శ్రేయస్సుకై స్వీకరించే మనోవైశాల్యం కలిగింది. హేతువాద ధోరణి ప్రబలింది. జాతీయతాభావం పుట్టుకొచ్చి ఈ జాతి శృంఖలాలను తెగగొట్టవలెనన్న కోర్కె బలీయమైంది. కాంగ్రెసు చరిత్రకారుడు ఈ ఉద్యమాలను గూర్చి వ్రాస్తూ - ''ఈ సంస్కరణోద్యమాలన్నీ వాస్తవానికి భారత జాతీయత అనే పేనిన త్రాడులో పురులవంటివి. ఇక జాతి కర్తవ్యం ఒకానొక సంయోగమును కలిగించి దానిని నూతన యుగపు జాతీయతతో సంధాన పరచడమే'' అన్నారు. జరిగినది కూడా అదే. భారత సంస్కరణోద్యమాల ఫలసిద్ధి అంతా ఏకమై భారత జాతీయోద్యమంగా ఆవిర్భవించింది. భారత పునరుజ్జీవనమనే సౌధానికి సంస్కరణోద్యమాలు మూల స్తంభాలు.

# 6. జాతీయతాభావం - స్వాతంత్ర్యం

యూరపు పునరుజ్జీవనం ఫలితంగా అక్కడ జాతిప్రాతిపదికపై రాజ్యాలు (Nation States) ఏర్పడినవిషయం మనమెరిగినదే. అట్లే ప్రజలలో స్వాతంత్ర్యము యెడ ప్రగాఢమైన వాంఛ రేకెత్తి రాజకీయ పరిణామాలు సంభవించిన విషయం కూడా అందరికీ తెలిసినదే. భారతజాతీయత అనేది చరిత్రలో ఎప్పటి నుంచి ఆరంభమైనదో చెప్పడం కష్టం. ఈ దేశం ఏ యుగంలో ఎన్ని రాజ్యాలుగా విభజితమై ఉన్నా, హిందువులకు ఉత్తరాన హిమాలయాలు మొదలు దక్షిణాన కన్యాకుమారి వరకు ఉన్నప్రాంతం మొత్తం భారతదేశమే. కనుకనే ఆసేతు శీతనగము అన్నమాట ఏర్పడింది. భరతవర్షే, భరతఖండే అంటూ దీని ఎల్లలను కూడా చెప్పారు. అంటే రాజకీయంగా ఎన్ని విభాగాలు ఉన్నప్పటికీ సాంస్కృతికంగా భారతదేశమంతా ఏకదేశంగా కొన్ని శతాబ్దాలుగా భావింపబడుతూ ఉన్నది. విదేశీయుల దండయాత్రలు జరిగినప్పుడు ఇక్కడివారు జాతీయతా. భావంతోనే ప్రతిఘటించేవారు. జాతీయతకు చారిత్రక జాగృతి ముఖ్యాంశం చారిత్రకంగా ఏకజాతి అనే భావము ఉండనే ఉన్నది. అయితే అది అనేక దండయాత్రలవల్ల, ఇక్కడి కొందరు రాజ్యాధిపతుల స్వార్థభావంవల్ల క్రమేణా మరుగునపడిపోయింది. ముఖ్యంగా 18వ శతాబ్ది దేశరాజకీయ పరిస్థితులు ఇది ఏక దేశమా ? అన్న సందేహాన్ని కలిగించినమాట నిజం. కాని బ్రిటిషు పరిపాలన దేశంలో ఏర్పడిపోయిందని తెలగానే భారతజాతీయతాభావం తిరిగి బహిర్గతమైంది.

సిపాయీల తిరుగుబాటు అని వర్ణింపబడ్డ 1857వ సంవత్సరపు తిరుగుబాటు భారతజాతీయతా చరిత్రలో ఒక ముఖ్యఘట్టం. కాంగ్రెసు చరిత్రకారుడు దీని ప్రస్తావన తెచ్చి-"1857లో జరిగింది విదేశీయుల ఏలుబడిని అంతమొందించడానికి జరిగిన చివరి సాయుధ పోరాటం. అది 1757 ప్లాసీ యుద్ధం మొదలు ఆ పిమ్మట నూరేండ్ల కాలంలో జరిగిన దారుణానికంతటికీ నిరసనగానేకాక, మన దేశం మనవారిచేతనే పరిపాలింపబడవలెను, మరొకరు దీనిని పాలించకూడదన్న ప్రజావాంఛ ఫలితంగా కూడా ఆ పోరాటం జరిగింది'' అని వ్రాశాడు. అయితే ఆ పోరాటం విఫలమైంది. దానితోపాటే ఈస్టిండియా కంపెనీ పాలన కూడా

అంతరించింది. 1858లో భారత ప్రభుత్వం నేరుగా బ్రిటిషు రాజరికం అధీనమైంది. అంటే బ్రిటిషు పార్లమెంటు అజమాయిషీ క్రిందికి పోయింది. అనగా బ్రిటిషు సామ్రాజ్యం యొక్క అంతర్భాగమైంది. విక్టోరియారాణి ప్రకటనతో అంతా సద్దుమణిగింది.

కాని ఒక పోరాటంవల్ల ఉద్భవించిన రాజకీయ చైతన్యం ఎన్నటికీ పూర్తిగా హరించిపోదు. ఆ ప్రథమ స్వాతంత్ర్య సమర నాయకులు ప్రజలలో దేశభక్తి భావాలను రేకెత్తింపగలిగారు. తాంతియాతోపే, ఝాన్సీరాణి, నానా ఫడ్నవీసు మున్నగువారి ఆదర్శం, వారి త్యాగాలు, వారి వీరోచిత కృత్యాలు ప్రజలలో దేశభక్తి భావాన్ని పెంపొందజేశాయి. వారు రగిల్చిన నిప్పు నివురు గప్పినట్లు ఉండిపోయింది. ఆ విరోధం, అసహన భావం ప్రజలలో అట్లే ఉండిపోయాయి.

బ్రిటిషు పాలన దేశాన్ని రాజకీయంగా ఏకం చేసింది. దేశమంతటికీ వర్తించే శాసనాలు, పాలనా యంత్రాంగం ఏర్పడిపోయాయి. ప్రజలకు తాము ఏకదేశ ప్రజలమన్న గుర్తు కలిగింది. "భారతీయ సమాజంలో ఎన్నో అపశ్రుతులు, పరస్పరం పొసగని అంశాలు ఉన్నప్పటికీ బ్రిటిషు సామ్రాజ్యవాదం ఆ దేశానికి మూడో పక్షం ఆధ్వర్యాన (third party) రాజకీయ ఐక్యతను ఇచ్చింది'' అని ప్రొఫెసర్ మూన్ వ్రాశాడు. దేశంలో 1853లో మొదటి రైలు మార్గం పడింది. 1854లో మొదటి తంతి మార్గం పని టెలిగ్రాములు రావడం జరిగింది. రైళ్ళు, రోడ్లు మొదలగు రవాణా సౌకర్యాలు, తంతి తపాలా వంటి వార్తా సౌకర్యాలు ఏర్పడటంతో ఒక ప్రాంతానికి మరొక ప్రాంతానికి సంబంధాలు ఏర్పడ్డాయి. దేశనాయకులు తరచు ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి పోయి ప్రచారం చేసి, ప్రజలను స్వయంగా కలుసుకొని జాతీయోద్యమాన్ని వ్యాపింపజేసే వీలు కలిగింది.

జాతీయతా భావం పెంపొందడంలో ఆంగ్లభాష కూడా ముఖ్యపాత్ర వహించింది. అది దేశంలో వేర్వేరు ప్రాంతాలలో ఉండే విద్యావంతులకు ఉభయ సామాన్య భాషగా, జాతీయభాషగా ఉపయోగపడింది. ఇంగ్లీషు భాషవంటి మాధ్యమ సాధనం లేకపోతే బెంగాలీలు, పంజాబీలు, గుజరాతీలు, దాక్షిణాత్యులు ఒక బల్లముందు కూర్చొని సమస్యలను చర్చించుకోవడం దుస్సాధ్యమయ్యేది. అప్ప

టికీ ఇప్పటికీ ఆంగ్ల విద్యావంతులకు అదే జాతీయ భాష. పాశ్చాత్య గ్రంథ పఠనం వల్ల జాతీయత, దేశభక్తి, రాజకీయస్వేత్వాలు, స్వాతంత్ర్యం వంటివి ప్రజలకు మరింత బాగా అవగాహన అయ్యాయి. యూరపు ఖండంతో మనకు పరిచయం, సంబంధం కలిగింది. యూరపు మనల్ని రాజకీయంగా, సాంఘికంగా ప్రభావితం చేసింది. యూరపులో 19వ శతాబ్ది జాతీయభావపుశతాబ్ది అని చెప్పవచ్చు. జాతీయభావాలు, ఉదారవాదం (liberalism) అక్కడ ప్రస్ఫుటమయ్యాయి. జర్మనీ, ఇటలీల స్వాతంత్ర్యం భారతీయులకొక ఉదాహరణగా కన్పించింది. ఫ్రెంచి విప్లవ భావాలు తెలిసివచ్చాయి. స్వాతంత్ర్యాభిలాష హెచ్చింది. ఇంగ్లండులోనే 19వ శతాబ్దిలో రాజకీయ, సాహిత్య రంగాలలో లిబరలిజం అనబడే ఉదారవాదపు గాలి బాగా వీస్తోంది. రవీంద్రనాధ టాగూరు (1861-1941) ఈ ప్రస్తావన తెచ్చి ''ఇంగ్లండు దేశాన్ని మనం మహోజ్వలమైన దాని వాఙ్మయం ద్వారా తెలుసుకున్నాము. యువకులుగా ఉన్న మన జీవితానికది నూతనోత్తేజమిచ్చింది. ఆంగ్ల కవుల కవిత్వంలో, వారి గ్రంథాలలో మానవాళిపట్ల ప్రేమ, న్యాయం, స్వాతంత్ర్యం- ఈ భావాలే నిండిఉండేవి! మానవస్వాతంత్ర్యాన్ని గూర్చి వర్డ్స్‌వర్త్ మహాకవి సానెట్లలో ఎంత చెప్పబడి ఉంది! ఇవన్నీ పిన్న ప్రాయంలో ఉన్న మన ఊహలకు రెక్కలు తొడిగి మనల్ని ఆదర్శలోకాలకు తీసుకువెళ్ళాయి. వాటిని చదివి, మననం చేసుకొని, ఒక వేళ మనం విదేశీపాలకులపై తిరుగుబాటు చేసినా మనకు ఇతర పాశ్చాత్య దేశాల సానుభూతి ఇట్టే లభిస్తుందని నమ్మాము'' అని వ్రాశాడు.

స్వాతంత్ర్యం, ఉదారవాదం తన లక్ష్యాలని ఇంగ్లండు అసందిగ్ధంగా ప్రకటించింది. ఆదిలో ఇంగ్లండు భారతదేశంపట్ల, ఇతర వలసలపట్ల అటువంటి విధానాన్నే అనుసరిస్తున్నట్లు ఇంగ్లండు లిబరల్ రాజనీతిజ్ఞులు మనకొక అభిప్రాయం కలుగజేశారు. ఆంగ్లేయుల ఉదారవాదంపట్ల మనలో కొందరికి విశ్వాసం ఏర్పడింది. వారు ఈ దేశానికి ఏర్పాటు చేసిన ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు, లా కమీషన్, ఇండియా కౌన్సిల్ వంటి పాశ్చాత్య రాజకీయ వ్యవస్థలను చూచి ఇచటి మితవాద నాయకులు, కొందరు మేధావంతులుసైతం వారి ప్రకటనలను విశ్వసించి కొన్ని రాజకీయాభిప్రాయాలు ఏర్పరచుకొన్నారు. కాని రాను రాను అది తమ భ్రాంతి అని తెలిసిపోగానే నిరాశ చెందారు. ప్రభుత్వ సర్వీసులలో భారతీయులకు హెచ్చు ప్రాతినిధ్యం కావాలని కోరితే అందుకు బ్రిటిషువారు అంగీక

రించలేదు. బ్రిటిషు అధికారులు ప్రజలతో సంబంధంలేకుండా దూరంగా ఉండే వారు. అసలు తెల్లదొరలు భారతీయులను వేరుగా చూచేవారు. తమ అధికార హోదాను ప్రదర్శిస్తూ, తాము నల్లవారికన్న జాతి విషయకంగా అధికులమన్న అహంభావం చూపుతూ దేశీయులను చిన్నచూపు చూడటంచేత ప్రజలు వారి ప్రవర్తనను నిరసించారు. దేశంలో పాలకులదొక జాతి, పాలితులదొకజాతి అనే భావం కలిగేటట్టు చేశారు. భారతీయుల ఆత్మగౌరవం దెబ్బతిన్నది.

ఇది ఇట్లా ఉండగా ప్రజల ఆర్థిక బాధలు హెచ్చినవి. మధ్యతరగతుల వారిలో నిరుద్యోగం ప్రబలింది. భారతదేశ ఆర్థిక వ్యవస్థను పాలకులు వారి దేశ అవసరాలకు అనుగుణంగా తీర్చిదిద్దారు. భారతదేశాన్ని ఆర్థికంగా దోచుకో వడం మొదలుపెట్టారు. ఇంగ్లీషువారు ఇక్కడికి వచ్చిన మొదటి నూరేండ్లలోనే దేశం ఆర్థికంగా ఎంతో క్షీణించింది. ఈదేశంనుంచి వెండి బంగారాలను బైటికి పంపుతూ ఉండేవారు. ప్లాసీ యుద్ధంలో విపరీతంగా సొమ్ముదోపిడీ జరిగింది. క్రమేణా భారతీయ పరిశ్రమలు దెబ్బతిన్నాయి. తెల్లవారు ఈదేశాని వచ్చినప్పుడు ఇక్కడి కుటీర పరిశ్రమలు చాలా ఉచ్చస్థితిలో ఉండేవి. ఇక్కడ తయారైన వస్త్రాలు నాణ్యమైనవిగా ఎంచబడి విదేశాలకు ఎగుమతి అవుతూ ఉండేవి. కాని ఇంగ్లాండులో వచ్చిన పారిశ్రామిక విప్లవం (Industrial Revolution) భారత ఆర్థికవ్యవస్థపాలిట వినాశ హేతువు అయింది. బ్రిటిషు వారు ఇక్కడి పరిశ్రమల నడుము విరగగొట్టారు. ఇక్కడ యంత్రాలతో నడిచే పెద్ద పరిశ్రమలను పెట్టనివ్వలేదు. అవి తమకు పోటీగా నిలుస్తాయని వారిభయం. ఇండియాలో ఒక ఫ్యాక్టరీ నిర్మించాలంటే ఇంగ్లండులో అయిన ఖర్చుకు నాలుగురెట్లు అయేది. అందుకు కారణం మనం దిగుమతి చేసుకొనే యంత్రాలపై హెచ్చుపన్ను విధింపు. అయినా భారతీయుల పెట్టుబడితో కొన్ని బట్టలమిల్లులు ఏర్పడ్డాయి. కాని భారతదేశంలో తయారైన వస్త్రాలపై సుంకం విధించారు అంటే తమ రాజ్యంలోని సరుకులపై తామే పన్ను విధించారు! దీనితో వారు పరాయివారనే సత్యం పూర్తిగా తెలిసిపోయింది. లంకాషైర్‌లో తయారైన వస్త్రాలను ప్రోత్సహించడం వారి ఉద్దేశం. ఇంగ్లండు వస్త్రాలు భారత మార్కెట్లలో ఎక్కడచూచినా కన్పించేవి. భారత దేశాన్ని పూర్తిగా వ్యవసాయదేశంగా ఉంచి, ఇక్కడి ముడిసరుకును ఇంగ్లండులోని తమ పరిశ్రమలకు ఉపయోగించుకొని, వారి ఫ్యాక్టరీలలో తయారైన సరుకును తమ వలస దేశాలలో హెచ్చు ధరలకు అమ్మి డబ్బుగడించడం బ్రిటిషువారి ముఖ్య

లక్ష్యం.వ్యావసాయిక ఆర్థికవ్యవస్థలో ప్రజలు కేవలం భూమిపైనే ఆధారపడి ఉండవలసివస్తుంది. కాని భూమిపై వత్తిడి ఎక్కువై పొట్టగడవక కొందరు పట్నాల మిల్లులలో పనిచేయడానికి వెళ్ళి అక్కడ ఇచ్చే వేతనాలు చాలక దుర్భరపరిస్థితులోల జీవిస్తూ ఉండేవారు. గ్రామ పరిశ్రమలు మూలపడ్డవి. వ్యవసాయదార్లు ఋణభారంతో క్రుంగిపోయారు. తరచు కరువు కాటకాలు వచ్చి గ్రామాలు క్షీణదశకు వచ్చాయి. భారతదేశ ఆర్థిక దుస్థితిని రమేశ్‌చంద్ర దత్తు (1848–1909) తాను రచించిన 'ఎకనమిక్ హిస్టరీ ఆఫ్ బ్రిటిషిండియా' అనే గ్రంథంలో అత్యంత వాస్తవికంగా చిత్రించాడు. ఆ గ్రంథం చదివిన గాంధీజీ కన్నీరు పెట్టుకొన్నాడట. దేశీయులలో ఈ కారణంగా అసంతృప్తి హెచ్చింది.

ఈ కాలంలో ఇంగ్లీషు పత్రికలు, దేశభాషా పత్రికలు ప్రజలలో జాతీయ చైతన్యాన్ని కలిగించడానికి ఎంతో తోడ్పడ్డాయి. ఇవి భారతీయులు స్థాపించి పెంపుచేసిన పత్రికలు. ఎన్ని నిర్బంధాలున్నప్పటికీ స్వతంత్రంగా వ్యవహరిస్తూ నిర్భయంగా వాస్తవ పరిస్థితులను తెలుపుతూ విదేశీయ పాలకులను విమర్శిస్తూ సంపాదకీయాలు, వ్యాసాలు ప్రచురించేవి. ఈ సందర్భంలో 'ఇండియన్ మిర్రర్', 'బాంబే సమాచార్', 'ది హిందూ పేట్రియట్', 'అమృతబజార్ పత్రిక' 'హిందూ', 'కేసరి', 'ఆంధ్రపత్రిక', 'కృష్ణాపత్రిక' మొదలైనవి పేర్కొనదగ్గవి. కొన్ని పత్రికలు రాజకీయ విద్యాసంస్థలుగా పనిచేశాయి. మహామహులైన సంపాదకులు బ్రిటిషు సింహం జూలు పట్టుకు లాగారు. మట్టిలో నుంచి మాణిక్యాలను పుట్టించారు.

మత, సాంఘిక సంస్కర్తల ప్రబోధంవల్ల ప్రజలు మేల్కొన్నారు. స్వామి దయానంద సరస్వతి ఆయన అనుచరులపై ఎంతో జాతీయ ప్రభావాన్ని పరపినాడని కర్నల్ ఆల్కాట్ వ్రాశాడు. దయానందుడు భారతదేశం భారతీయులకే అని ప్రకటించాడు. "వివేకానందుడు ఆరాధించే మహారాజ్ఞి ఆయన మాతృభూమి" అని సిస్టర్ నివేదిత వ్రాసింది. ఆయన భారతీయులకు కొండంత ఆత్మ విశ్వాసాన్ని కలిగించాడు.

ముఖ్యంగా "భగవద్గీత" జాతీయోద్యమానికి ఇచ్చిన ఉత్తేజం చిరస్మరణీయమైనది. అందులో చెప్పబడ్డ కర్మ సిద్ధాంతం హైందవులను కార్యాచరణకు ప్రేరేపించింది. భగవద్గీతకు కొత్త భాష్యాలు వెలువడ్డాయి. తిలక్, అరవిందుడు,

బంకిచంద్రుడు, శ్రీమతి అనిబిసెంట్, గాంధీజీ, చక్రవర్తి రాజగోపాలాచారి, దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులువంటి మహనీయులు గీతకు వ్యాఖ్యానాలు వ్రాశారు. అవి భారతదేశ విద్యావంతులను స్వాతంత్ర్య సమరోన్ముఖులను చేశాయి.

భారతదేశ కవులు, రచయితలు దేశాభిమానోద్దీపకములైన రచనలు చేసి ప్రజలను మేల్కొలిపారు. ఈ సందర్భంలో బంకించంద్రుడు (1838-1894), భారతేందు హరిశ్చంద్ర (1850-1885), విష్ణుకృష్ణచిప్ళుంకర్ (1850-1882), సుబ్రహ్మణ్యభారతి (1882-1921), ముట్నూరి కృష్ణారావు (1879-1946), ప్రేమ్‌చంద్ (1880-1936) వంటి రచయితలను స్మరింపవలసి ఉన్నది. బంకించంద్రుడు రచించిన "వందేమాతరం" గీతం ఆసేతు హిమాచలము భారతీయులను ఉర్రూతలూగించింది. బిపిన్‌చంద్రపాల్ (1858–1920) అరవింద ఘోష్ వంటి పెద్దలు ఆ గీతమును లమ సమర మంత్రంగా ఎంచుకున్నారు. అరవిందుడు దానిని అంగ్లములోకి అనువదించాడు. భారతజాతీయతా భావాన్ని మహిమోపేతంగా వ్యక్తం చేసిన దేశభక్తి గీతమది. అన్ని తీరుల భావములూ, ఆశయాలూ కలిగి ఉండి, మనోద్వేగం అంత గంభీరమూ తీక్ష్ణమూ అయినదీ, వ్యక్తీకరణ అంత ప్రస్ఫుటమూ అయిన దేశభక్తి గీతం మరి ఏ ఇతర సాహిత్యంలోనూ కానరాదని బంకించంద్రుని జీవితచరిత్ర వ్రాసిన విద్వాంసుడు సుబోధ చంద్ర సెన్‌గుప్త అన్నాడు.మహాత్మాగాంధీ ఆ గీతాన్ని ప్రస్తుతిస్తూ "దాని మూలము ఏదైనప్పటికీ, ఎప్పుడు ఏ విధంగా అది రచింపబడినప్పటికీ, బెంగాలు విభజన రోజులలో అది బెంగాలీ హిందువులకూ, ముస్లిములకూ యుద్ధనినాదమైంది. అది సామ్రాజ్య వ్యతిరేక నినాదం. నేను కుర్రవాణ్ణిగా ఉన్నప్పుడు నాకు 'ఆనంద మఠం' నవలను గూర్చి తెలియదు. ఆ నవలలో ఈ గీతమున్నట్లు తెలియదు. ఆ గీతం రచయిత ఎవరోకూడా తెలియదు. వందేమాతరం నన్ను ఆవేశించింది. మొదట ఎవరో దాన్ని పాడగా విని పరవశుడనయ్యాను. అత్యంత స్వచ్ఛమైన జాతీయతా భావాన్ని నేను ఆ గీతంలో దర్శించాను" అన్నాడు. ఆ గీతం నిజాం పరిపాలనా కాలంలో హైదరాబాదు రాష్ట్రంలో ఒక విద్యార్థి ఉద్యమానికే కారకమైంది. గురజాడ అప్పారావు (1861-1915) రచించిన 'దేశమును ప్రేమించుమన్నా' అనే గేయంకూడా శ్రేష్ఠమైన దేశభక్తి గీతమే. కాని ఎందువల్లనో ఆంధ్రలో జాతీయోద్యమ కాలంలో అది అంతగా ప్రచారములోకి

రాలేదు. దానికన్న గరిమెళ్ళ సత్యనారాయణ రచించిన 'మాకొద్దీ తెల్ల దొర తనం' అన్నపాట, చిలకమర్తి లక్ష్మీనరసింహం (1867-1946) గారి పద్యాలు బాగా వ్యాప్తిచెందాయి. సకలభారతంలో ఆయా ప్రాంతాల కవులు వారివారి భాషలలో జాతీయాభిమానాన్ని పెంపొందించే రచనలుచేసి దేశీయులను ప్రబోధించారు. దేశభక్తి కవిత్వం ఒక శాఖగా పెంపొందింది.

యావద్భారతదేశానికి కాంగ్రెసువంటి ఒక రాజకీయసంస్థ ఏర్పడక మునుపే దేశంలోని పలుప్రాంతాలలో కొన్ని సంస్థలు ఏర్పడి ప్రజలలో రాజకీయచైతన్యం కలుగజేయడానికి కృషి చేశాయి. 1843 లో కలకత్తాలో బ్రిటిష ఇండియా సొసైటీ ఏర్పాటు అయింది. రాజేంద్రలాల్, ఆయన మిత్రులు కలిసి 1851లో కలకత్తాలో బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్ నెలకొల్పారు. నబగోపాల్ మిత్రా 1865లో పేట్రియట్స్ అసోసియేషన్ ఏర్పాటు చేశాడు. ఈయనకు అనేక జాతీయ సంస్థలతో సంబంధముండుటచే మిత్రులు చమత్కారంగా ఈయనను 'నేషనల్ మిత్ర'అనేవారు.రమారమి అకాలంలోనే దాదాభాయినౌరోజీ(1825-1917) ఆయన సహచరులు బొంబాయి అసోసియేషన్ స్థాపించారు. 1867లో బెంగాలులో హిందూమేల ఆరంభమైంది. టాగూరు కుటుంబీకులు ఇందులో పాల్గొనేవారు. గణేశ్‌వాసుదేవజోషి 1872లో పూనా సార్వజనిక సభ ఏర్పాటు చేశాడు. ఇండియన్ సివిల్ సర్వీసు నుంచి తొలగింపబడ్డ సురేంద్రనాథబెనర్జీ(1848-1925) 1876లో ఇండియన్ అసోసియేషన్ ఆఫ్ కలకత్తా అనే సంస్థను నెలకొల్పాడు. బెనర్జీయే 1883లో దేశంలోని వివిధ ప్రాంతాల ప్రతినిధులతో ఇండియన్ నేషనల్ కాన్ఫరెన్స్ సభ జరిపాడు. 1884లో మద్రాసు మహాజనసభ స్థాపించబడింది. 1885లో బొంబాయి ప్రెసిడెన్సీ అసోసియేషన్ ఏర్పాటైంది. ఈ రెండు సంస్థలూ ప్రజాజీవితానికీ పరిపాలనకూ సంబంధించిన సమస్యలను అధికారుల దృష్టికి తేవడానికి ప్రయత్నించాయి. బెంగాలులో రాజనారాయణ బోసు (1826-1900) 1861 లోనే సొసైటీ ఫర్ ది ప్రమోషన్ ఆఫ్ నేషనల్ గ్లోరీ అనే సంస్థను నెలకొల్పాడు. జ్యోతీరావు పూలే సత్యశోధక సమాజ్ స్థాపించాడు. స్థానికంగా అక్కడక్కడా మరికొన్ని సంస్థలు ఏర్పాటై ప్రజల ఇబ్బందులను ప్రభుత్వ దృష్టికి తెస్తూ, ప్రజాజీవితంలో రాజకీయ జాగృతి కలిగించాయి.

దేశంలో పెల్లుబుకుతూ ఉన్న రాజకీయాందోళననూ, ఆర్థిక దుస్థితివల్ల కలుగుతూ ఉన్న తీవ్రమైన అసంతృప్తినీ గమనించిన అలాన్ ఆక్టేవియన్

హ్యూమ్ (1829-1912) (ఈయన ఇండియన్ సివిల్ సర్వీసునుంచి రిటైరు అయినవాడు.) దేశీయులు తమ ఇబ్బందులను రాజ్యాంగ బద్ధమైన పద్ధతిలో తెలుపుకోవడానికి ఒక అఖిల భారత రాజకీయ సంస్థ అవసరమని గట్టిగా విశ్వసించి "భారత ప్రజల మానసిక నైతిక, సాంఘిక, రాజకీయ పునరుద్ధరణకు ఒక సంస్థను ఏర్పాటు చేయుటకు ముందుకు రావలసిందిగా" కలకత్తా విశ్వవిద్యాలయ పట్టభద్రులకు సూచించాడు. అసలు ఈ మాదిరి ఆలోచన 1884లో మద్రాసులో దివ్య జ్ఞానసమాజంవారి సమావేశం జరిగిన తరువాత 17 మంది పెద్దలు ప్రైవేటుగా సమావేశమైనప్పుడు వారికి తట్టిందనీ, ఆ పిమ్మట అది కార్యరూపం దాల్చిందనీ అంటారు. ఏమైనా హ్యూమ్ ప్రయత్నాలు ఫలించి అఖిల భారత జాతీయ కాంగ్రెసు మొదటి మహాసభ 1885 డిసెంబరు 28వ తేదీ మధ్యాహ్నం 12 గం. లకు బొంబాయిలోని గోకుల్‌దాసు తేజ్‌పాల్ సంస్కృత కాలేజీ హాలులో కలకత్తా న్యాయవాది డబ్ల్యు. సి. బెనర్జీ (1844-1906) అధ్యక్షతన జరిగింది.

తొలిరోజులలో కాంగ్రెసు తీర్మానాలు మితవాద ధోరణిలో ఉండేవి. కాంగ్రెసుసంస్థ మొదటి 20 సంవత్సరాలలో ఆమోదించిన తీర్మానాలను బ్రిటిషు ప్రభుత్వం ఖాతరు చేయనేలేదు. బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని కదపడానికి ఇంతకన్నా సాహసోపేతమైన చర్యలు అవసరమని భారతీయులు గ్రహించారు. దౌర్జన్యవాదమూ వచ్చింది. వ్యక్తులు హింసాత్మక చర్యలకు దిగారు. మరణ శిక్షలు పొందారు. కాంగ్రెసులో మితవాదులు, అతివాదులు అనే పక్షాలు ఏర్పడ్డాయి. అయినా తీవ్రమైన ఆందోళనకే హెచ్చుమంది మద్దతు ఇచ్చారు. 1904-5లో రష్యాపై జపాన్ విజయం భారతీయులలో మహోత్సాహం కలుగజేసింది. జపానువంటి చిన్న దేశం రష్యావంటి పెద్ద దేశంపై గెలుపు సాధించినప్పుడు బ్రిటిషు సామ్రాజ్యాన్ని కదల్చలేమా అన్న ధైర్యం భారతీయులకు కలిగింది. బెంగాలు విభజన దేశీయుల ఆందోళనను తీవ్రం చేసింది. స్వదేశీ ఉద్యమం వచ్చింది. విదేశీవస్త్ర బహిష్కరణ జరిగింది. 1906లో జరిగిన కాంగ్రెసులో 'స్వరాజ్' అన్నమాట వినపడింది. లోకమాన్య బాలగంగాధర తిలక్ (1856-1920) "స్వరాజ్యం నా జన్మహక్కు" అని ఉద్ఘాటించి స్వాతంత్ర్య సమరానికి దీప్తి కలిగించాడు. తిలక్ మహారాష్ట్రలో శివాజీ, గణపతి ఉత్సవములు జరిపించి

ప్రజలలో గొప్ప చైతన్యం కలిగించాడు. ఆయనకు బాసటగా బిపిన్ చంద్రపాల్ (1858-1920), లాలా లజపతిరాయ్ (1865-1928) నిలిచారు. మొదటి ప్రపంచయుద్ధం (1914-1918) కాలంలో బైటి ప్రపంచాన్ని గూర్చిన వార్తలు మొదటి సారిగా భారతీయుల గృహాలలోకి వెళ్ళాయి. ఈ యుద్ధానంతరం ఆధునిక భారత చరిత్రలో యుగపురుషుడైన మోహన్‌దాస్ కరమ్ చంద్ గాంధి (1869-1948) రాజకీయ రంగంపైకి వచ్చి అసంఖ్యాక భారతీయుల హృదయాలను ఆకట్టుకొని స్వాతంత్ర్యోద్యమాన్ని నడిపాడు. ప్రజలు ఆయనను 'మహాత్ముడు' అనీ, 'గాంధీజీ' అనీ అన్నారు. ఆయన రాకమునుపు ఉద్యమస్వభావం వేరు. ఆయన వచ్చిన తరువాత వేరు. అదొక మహత్తర పరిణామం. ఆయన స్వాతంత్ర్య సమరాన్ని ప్రజలలోకి తీసుకువెళ్ళాడు. యావద్భారతంలో ఆయన పేరు వినిపించింది. ఆ కీర్తి మరొకరికి రాలేదు. జాతి మొత్తం ఆయనను అనుసరించింది. ఆయన నైతిక ప్రవర్తనకు ప్రాముఖ్య మిచ్చాడు. లక్ష్యం ముఖ్యమా, అందుకు అవలంబింపబడే సాధనాలు ముఖ్యమా అన్న ప్రశ్న వచ్చినప్పుడు సాధనాలే ముఖ్యమని నొక్కిచెప్పాడు. భారత దేశ గ్రామపునరుద్ధరణకు నడుము కట్టాడు. సత్యాహింసలతో, సత్యాగ్రహమనే ఆయుధంతో, ప్రాయోపవేశమనే ఆత్మశుద్ధితో, అసహాయోద్యమమనే సాత్వికమైన తిరుగుబాటుతో, శాసనోల్లంఘనమనే కుదుపుతో ప్రపంచంలో కనీ వినీ ఎరుగనట్టి స్వాతంత్ర్య సమరాన్ని నడిపాడు. ఇంతలో రెండవ ప్రపంచ యుద్ధం (1939-1945) వచ్చింది. సుభాస్ చంద్రబోసు (1897-1945) దేశంనుంచి తప్పించుకుపోయి జర్మనీ జపానుల సహకారంతో ఆజాద్ హింద్ ఫౌజు నెలకొల్పి సింగపూరులో స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని ప్రారంభించాడు. జవహరలాలు నెహ్రూ గాంధీజీని అనుసరించే ఉన్నాడు. భారతీయులను సంప్రతించకుండా బ్రిటిషువారు భారత దేశాన్ని యుద్ధంలోకి దింపారు. తన శక్తి యుక్తులన్నీ నిరంకుశులైన పాలకుల విషయంలో పనిచేయకపోగా తుదకు గాంధీజీ 'క్విట్ ఇండియా' (భారత దేశం వదిలి వెళ్ళండి) అనే నినాదంతో 1942లో అంతిమ సమరంతో బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని పరాస్తం చేశాడు. 1947 ఆగస్టు 15 తేదీన స్వతంత్ర భారతం అవతరించింది. గాంధీజీ భారతదేశానికి స్వాతంత్ర్యం తెచ్చి ఈ దేశాన్ని రాజకీయంగా పునరుజ్జీవింప జేసిన వ్యక్తి మాత్రమే కాదు; ఈ విశాల దేశాన్ని

సాంఘికంగా, ఆర్థికంగా, నైతికంగా పునరుద్ధరించి, రాజకీయాలలో రాజనీతికాదు, నీతి న్యాయం ముఖ్యమని ప్రపంచానికి చాటి భారతీయ ఆత్మను ప్రకాశింపజేసిన లోకోత్తర పురుషుడు. ఒక మతోన్మాది తుపాకీ గుండ్లకు బలియై ఆయన మరణించిన వైనంలో సైతం ఆయన తన ముఖ్యాదర్శమైన హిందూ ముస్లిం మత సామరస్యం ఆవశ్యకతను నొక్కి వక్కాణించాడు.

1950 జనవరి 26వ తేదీన భారతదేశం సర్వస్వతంత్ర ప్రజారిపబ్లిక్ అయింది. అంటే ప్రపంచం ఇరవయ్యో శతాబ్ది ద్వితీయార్ధ భాగంలోకి అడుగు పెట్టిన సమయంలో ఈ ప్రాచీనదేశం తిరిగి స్వతంత్రరాజ్యమైంది. స్వతంత్ర భారతదేశానికి మొదటి ప్రధానమంత్రి అయిన పండిత జవహరలాలునెహూ్రు (1889-1964) అంతర్జాతీయ దృష్టితో ప్రపంచశాంతిని కాంక్షించి శాంతియుత సహజీవనంపై, అలీన సిద్ధాంతముపై ఆధారపడిన విదేశాంగ విధానంతో, సమాజాభివృద్ధినీ వికాసాన్నీ ఉద్దేశించిన ప్రణాళికలతో, వైజ్ఞానిక పురోగమనానికీ, సత్వర సంపత్సమృద్ధికీ పాటుపడి శ్రేయోరాజ్యానికి పునాదులు వేసి భారత దేశాన్ని ప్రపంచ అగ్రరాజ్యాల సరసన నిలబెట్టాడు. భారత స్వాతంత్ర్యానికి బద్ధవ్యతిరేకి అయిన సర్ విన్‌స్టన్ చర్చిల్ వంటి ఆంగ్లమితవాది స్వాతంత్ర్య సమరయోధుడూ, ఉత్తమ దేశభక్తుడూ, చరిత్రకారుడు, రాజనీతిజ్ఞుడు, మహామేధావి, శాంతిదూత అయిన నెహూ్రును ''మానవులలో సర్వసామాన్యంగా గోచరించే క్రోధద్వేషములకీయన అతీతుడు'' అని శ్లాఘించాడంటే అది భారత పునరుజ్జీవనం మహత్వమునూ, చరితార్థతనూ చాటుతున్నది. భారకాదేశానికి ప్రజాస్వామ్యం, సెక్యులరిజం, సోషలిజం ప్రాతిపదికలవి నెహ్రూ నిర్దేశించాడు.

పతనావస్థనుంచి, సాంఘిక దురన్యాయములనుంచి, పరాధీనత నుంచి బైటపడి ఈ దేశం సర్వస్వతంత్ర భారత రిపబ్లిక్‌గా అవతరించి అభ్యుదయ పథంలో పురోగమించడం భారత పునరుజ్జీవనోద్యమానికి పరాకాష్ఠ. ఈ పరిణామం ప్రపంచంలో మరెన్నో దేశాల స్వాతంత్ర్యానికి శ్రేయోభివృద్ధులకూ దారితీసింది. సామ్రాజ్యవాదం దెబ్బతిన్నది. ప్రపంచ చరిత్రలో ఇది మహోజ్జ్వల ఘట్టం.

# 7. సాహిత్యం, కళలు, విజ్ఞానం *

భారతీయ పునరుజ్జీవనోద్యమం కలుగజేసిన సత్ఫలితాలలో సాహిత్య, కళా, వైజ్ఞానిక రంగాలలో జరిగిన నవ్యసృష్టి అపూర్వమైనది. దానివల్ల మన సంస్కృతిలో ఒక నూతనాధ్యాయమే ఆరంభమైనది. దాని గుణవిశేషం పాశ్చాత్యరీతుల ననుసరించి సృజన చేయడం. ఇది ఒక కొత్త సోయగపు సృజన. కొత్త విజ్ఞానమును, భౌతిక విశేషాలను కనుగొనడం, దానితో పాటు ప్రాచీన నాగరికత మన కిచ్చిన నిధినిక్షేపాలను సేకరించి పదిలపరచి, వాటిని పునరుద్ధరించడం (Revival). దీనికి పాశ్చాత్య ప్రభావం, ఆంగ్ల యూరపు కృతుల ఒరవడి కారకమైనది. అయితే ఇది పూర్తిగా వాటి అనుకరణం కాదు. వాటిని ఆస్వాదించి, జీర్ణించుకొని ఆ పోలికలతో దేశీయమైన, భారత స్వభావానికి సహజమైన సృష్టి చేయడం జరిగింది. ప్రతిభా రహితమైన అనుకరణమే జరిగి ఉంటే అవి నిలిచేవికావు. కాని కొన్ని దశాబ్దాలు గడచినా, తరం మారినా అవి ఆస్వాదయోగ్యమైనవిగా, దర్శనీయమైనవిగా మననము చేయదగినవిగా ఉన్నాయందే వాటి మౌలిక ప్రతిభ విదితమవుతున్నది.

నవ్యసృష్టి జరగక మునుపు భారత సాంస్కృతిక రంగం ఎట్టి క్షీణదశలో ఉండేదో ప్రొఫెసర్ కె. ఆర్. శ్రీనివాస అయ్యంగార్ (వీరు ఆంగ్ల విద్వాంసులు, కొంతకాలం ఆంధ్రవిశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా ఉన్నారు.)ఇట్లా చెప్పారు : "ఒకప్పుడు విద్యాపాండిత్యాలకూ, యథేష్టమైన కళలకూ, సంస్కృతికీ నిలయంగా ఉండే ఈ ఉపఖండం 17, 18 శతాబ్దాలలో చెప్పుకో దగ్గ విద్య కూడా లేనట్టిదైంది. ఏదో కొద్దీ గొప్ప మిగిలిన సాంప్రదాయిక విద్యాకేంద్రాలకూ అసంఖ్యాకులైన నిరక్షరాస్యులకూ మధ్య పెరిగిపోతూ

---

* ఈ ప్రకరణం రచనకు సాహిత్యానికి సంబంధించినంతవరకూ కేంద్ర సాహిత్య అకాడమీ, ఢిల్లీ వారు ప్రచురించిన 'కంటెంపోరరీ ఇండియన్ లిటరేచర్' అన్న గ్రంథం ఉపకరించింది.

ఉన్న అగాధాన్ని పూరించడానికి గట్టి ప్రయత్నమేదీ జరగలేదు. ఆ పరిస్థితు లలో అటువంటి యత్నం జరిగే అవకాశం కూడా లేకపోయింది. భారత ప్రజల దేహాన్నీ, ఆత్మనూ చెప్పనలవికాని శారీరక, బౌద్ధిక, ఆధ్యాత్మిక జడత్వం ఆవహించింది. దానితో భారతీయ సంస్కృతి అనే స్రవంతి జాతీయ దాస్యమనే ఎండి బీటలు వారిన బీడు నేలలో ఎక్కడో ఇంకిపోయింది.''

ఇక ఆధునిక భారతీయ సాహిత్యం ఏవిధంగా ఆవిర్భవించిందీ ప్రొఫెసర్ శ్రీనివాస అయ్యంగార్ చక్కగా చెప్పారు: ''రామమోహన్‌రాయ్ ప్రభృతుల విప్లవ సదృశమైన దృష్టి, క్రైస్తవ మిషనరీల విద్యావిషయక కృషి, ఆంగ్ల భాషద్వారా ఆధునిక విద్యను బోధింపవలెనన్న మెకాలే పథకాన్ని 1835లో బ్రిటిషు ప్రభుత్వం ఆమోదించడం—ఇవన్నీ కనీసం రాబొయ్యే ఒక శతాబ్దికాలం వరకైనా భారతదేశ విద్యా సంస్కృతులు ఏ నమూనాలో ఉండవలసిందీ నిర్ణయించాయి. క్రమేణా స్కూళ్ళు కాలేజీలు ఇంగ్లీషు మీడియం ద్వారా విద్య బోధింప నారంభించాయి. ఒక్క తరంలోపలే ఎందరో భారతీయులకు ఐరోపా ఖండపు—ఆంగ్లసాహిత్య సంపదతో పరిచయం కలిగింది. ఈ విధంగా చైతన్యవంతమైన విద్యను సముపార్జించిన యువకులకు భారతదేశాన్ని మరల ప్రపంచ సంస్కృతి పటముపై ప్రతిష్ఠించవలెనన్న కోర్కె కలిగింది. మూగవోయినట్లున్న దేశాన్ని తిరిగి పలికేటట్టు చేయవలెనని వారు ఉవ్విళ్ళూరారు. ఇంగ్లీషులోనో, లేదా మాతృభాషలలోనో రచన చేయాలి. ఇంగ్లీషులో వ్రాస్తే తమ ఆంగ్ల ప్రభువుల దృష్టిని ఆకర్షించవచ్చు. పైగా వివిధభాషాప్రాంతాలలోని సోదర దేశీయుల దాకాకూడా పోవచ్చు.మాతృభాషలో ఎందుకు వ్రాయాలంటే-తమ ఆత్మలను పరిరక్షించుకోవడంకోసం; తమ ప్రజానీకానికి తెలిసిరావడానికి వారిని విద్యావంతులను చేయడానికి. మొత్తంపై ఇంగ్లీషులో వ్రాసినా, మాతృ భాషలో వ్రాసినా వారు స్వీకరించిన నమూనాలు ఆంగ్లసాహిత్యంనుంచే. అది సహజంకూడా. అప్పటికి వారికి తెలిసిన ఆధునిక యూరపు సాహిత్యం అదొక్కటే. ఏమైతేనేమి, పాశ్చాత్య సంపర్కంవల్ల కలిగిన కుదుపుకు నేల కుళ్ళగింపబడింది. ఆంగ్లసాహిత్యం ఆ నేలను సారవంతం చేసింది. కాలక్రమాన ఆధునిక భారతీయ సాహిత్యం అవతరించింది'' అన్నారు అయ్యంగార్.

మొత్తంపై నవీన సృష్టికి పాశ్చాత్య సాహిత్యం ఒరవడి కావడం గమ నార్హమైన విశేషం. మన సాహిత్య నిర్మాతలపై పాశ్చాత్య సాహిత్య ప్రభావం

ఎంత ఉందో తెలుసుకోవడానికి ఒక ఉదాహరణ ఇస్తాను. శ్రీ కె. ఎం. మున్షీ (1887-1971) గుజరాతీ, ఆంగ్ల భాషలలో ప్రముఖ రచయిత. ఆయనను ఒక పాఠకుడు "మీ సృజనాత్మక కృషిలో మిమ్మల్ని ప్రభావితం చేసింది ఎవరు?"* అని అడిగితే అందుకు సమాధానంగా ఆయన ఈ క్రమం ప్రకారమని చెబుతూ మహాభారతము, షేక్స్‌పియర్, కాళిదాసు, షెల్లీ, డ్యూమాస్, హ్యూగో, గెథే అని చెప్పాడు. అంటే భారత దేశానికి చెందినవారు వ్యాసుడు, కాళిదాసు ఇద్దరే! తక్కిన ఐదుగురూ పాశ్చాత్యులే. భారతీయ విద్యాభవన్ నెలకొల్పి, భారతీయ సంస్కృతి ఆవిష్కారానికి ఎంతో కృషి సల్పి ప్రాచ్యవిజ్ఞాన నిధి అని పేర్వడసిన మున్షీ పైననే పాశాత్య సాహిత్య ప్రభావం ఇంతగా ఉంటే సామాన్యుల సంగతి చెప్పాలా!

భారత నవ్య సాహిత్య సృష్టికి ఆంగ్ల సాహిత్యం ఆదర్శం కావడం ఒకందుకు మంచిదే అయింది. "వైతాళికులు", "నవీన కావ్యమంజరి" వంటి కావ్య సంకలనముల సంకలనకర్త ముద్దుకృష్ణ ఈ ప్రస్తావన తెచ్చి "ప్రపంచంలో అన్ని భాషల కన్నా ఇంగ్లీషు భాషకి ఒక ప్రత్యేకత ఉన్నది. ప్రాచీనకాలంలో గ్రీకు రోమన్ భాషలలోనూ, మధ్యకాలంలో ముఖ్యంగా ఫ్రెంచి జర్మన్ రష్యన్ భాషలలోనూ, తరువాత ప్రపంచంలోని అనేక భాషలలోనూ రచన అయిన ఉత్తమ గ్రంథాలు అనేకం ఇంగ్లీషు భాషలోకి తర్జుమా కావడం పరిపాటి. అందువల్ల మనవారు ఇంగ్లీషు భాషలో పాండిత్యం సంపాదించగానే తద్వారా యూరపు దేశాలలోని ఉత్తమ రచనలను అవగాహన చేసుకొనే అవకాశం కలిగింది. అంతలో మన రచనలలో కొత్త తీరులు ప్రారంభమైనవి" అన్నారు. ఇందుకు 'గీతాంజలి', 'ఉమర్ ఖయాం రుబాయీలు' 'ఖలీల్ జిబ్రాన్ రచనలు' ఉదాహరణలు.

ఆంగ్ల భాషా సాహిత్యాల ప్రభావం పుట్టుపూర్వోత్తరాలను సమీక్షిస్తూ రవీంద్ర మహాకవి తన ఎనభయ్యో జన్మ దినోత్సవ సందర్భాన (మే 1941) ఇచ్చిన సందేశంలో "ఈ సువిశాల ప్రపంచ మానవులతో మన ప్రత్యక్ష సంబంధం ఆ తొలినాళ్ళలో మనమెరిగిన ఆంగ్ల ప్రజల సమకాలిక చరిత్రతో ముడివడి

* "రిప్లయిస్ టు ది రీడర్" భారతీయ విద్యాభవన్, బొంబాయివారి ప్రచురణ.

ఉంది. శక్తిమంతమైన వారి వాఙ్మయం ద్వారానే మన సముద్ర తీరాలకు కొత్తగా వచ్చిన వీరి విషయంలో మన భావాలను ఏర్పరచుకున్నాము. ఆ రోజులలో మనదేశంలో మనకు గరపబడేటువంటి విద్య సమృద్ధియైనదీకాదు, వైవిధ్యం కలదీ కాదు. అందులో శాస్త్రీయమైన విచారణాదృష్టి లేదు. అది అట్లా చాలా పరిమితమైనదగుటచే ఆ రోజులలో విద్యావంతులైనవారు ఆంగ్ల భాషా సాహిత్యాలను ఆశ్రయింపవలసి వచ్చింది. మనవారు రాత్రింబగళ్ళు బర్క్ గంభీర ప్రసంగములనూ, సుదీర్ఘంగా గొలుసుకట్టువలె సాగే మెకాలే వాక్య పరంపరనూ పెద్దగా చదువుతూ మననం చేసేవారు. విద్యాగోష్ఠులలో షేక్స్పియరు నాటకాలు, బైరన్ కవిత్వం, అన్నిటికన్న విశాల హృదయం గోచరించే 19వ శతాబ్దియొక్క ఆంగ్ల రాజకీయాల ఉదారవాదము(Liberalism)ప్రధానాంశములుగా ఉండేవి.. మనకు పాలకులైనవారి దయాధర్మాలపై ఆధారపడి ఉండేటువంటి ఆ వైఖరి నిజానికి గర్వకారణమైనదికాదు. అయితే ఇక్కడ గమనార్హమైన విశేషమేమిటంటే మానవ ఘనతను-అది విదేశీయులలో కన్పించినాసరే-దానిని మనం పరిగణనకు తీసుకున్నాము. మానవాళి యొక్క మహోత్తమ, దివ్యగుణాత్మకమైన ప్రజ్ఞ ఏ ఒక్క జాతికీ దేశానికీ మాత్రమే గుత్తయై ఉండరాదు. దాని వ్యాప్తికి పరిమితులు, విధి నిషేధములు ఉండరాదు. ఎవరో ఒక లోభి భూగర్భంలో దాచుకొన్న సొత్తు కాకూడదది. కాబట్టే గతంలో మన బుద్ధిని వికసింపజేసినట్టి ఆంగ్ల సాహిత్యం దానియొక్క గాఢ ప్రతిధ్వనిని ఈ నాటికీ మన హృదయ కుహరములలోకి పంపగలుగుతున్నది'' అని ఆంగ్ల సాహిత్య మహత్వమును రవీంద్రుడు కొనియాడినాడు.

అయినా ఆంగ్లసాహిత్యంపై మాత్రం ఏ ప్రభావాలూ లేవా ? ఉన్నవి. ప్రపంచ వాఙ్మయాలనన్నిటినీ జీర్ణించుకొని అది వృద్ధి జెందింది. ఈ విషయాన్ని వివేచన చేసిన దువ్వూరి రామిరెడ్డిగారు ''ఇంగ్లీషు వాఙ్మయ చరిత్రలో 18వ శతాబ్ది నీరసమైన ఘట్టమని కొందరు ఆంగ్లేయ విమర్శకుల అభిప్రాయము. ఆ కాలపు నియోక్లాసిక్ (neo-classic) పద్ధతికి ప్రతిగా రొమాంటిక్ కవిత్వోద్యమము (Romantic movement) 19వ శతాబ్ది ఆరంభమున బయలు దేరినది. ఆ కాలపు నవ్యకవులకు లక్ష నిర్బంధములు. ఛందో నిర్బంధములు, వ్యాకరణపు కట్టుబాట్లు అసహ్యములుగా తోచినవి. పూర్వ రచనపై అసంతృప్తి కలిగినది. ఈలాంటి స్వేచ్ఛాప్రియత్వం కలుగుటకు ఫ్రెంచి విప్లవంవల్ల

ఇంగ్లాండులో వ్యాపించిన నూతన భావముల ప్రభావమే కారణమని చెప్పవచ్చును. బంధాలు వదిలించుకొని కాలు సేతులు హాయిగా చాపుకొన్నారు కవులు. ఈ మార్పు రచనలలో గోచరించినది''* అన్నారు.

ఆధునిక కాలంలో మన దేశీయ భాషలలో నూత్నసృష్టి పుట్టుపూర్వోత్తరాలను ప్రొఫెసర్ వి.కె. గోకాక్ (వీరు కొంతకాలం బెంగుళూరు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా పనిచేశారు) ఎంతో తేటతెల్లముగా విశదీకరించారు. అసలు భారతీయ సాహిత్యం పునరుజ్జీవనాన్ని ఆయన బాగా పరిశీలించారని ఆయన వ్యాసాల వల్ల తెలియవస్తుంది. గ్రంథ విస్తరభీతితో నేను ఆయన భావాలను సంక్షిప్తంగా మాత్రమే ఇక్కడ ఉదాహరిస్తాను. గోకాక్ ఇట్లా వ్రాశారు: ''మొదట పాశ్చాత్య లోకం మన భారత దిఙ్మండలంపై దీపాలు వెలిగించింది. అవి అంతకుమునుపు లేన ట్టివిగా కన్పించాయి...ఆంగ్లసాహిత్యం భారతీయ రచయితలకు కొత్త నేత్రాలు, కొత్త వీనులు ఇచ్చింది. నవల, కథానిక, విషాదాంతనాటకం, జీవిత చరిత్ర, ఆత్మకథ, వ్యాసం, ధినచర్య (డైరి), లేఖాసాహిత్యం, భావగీతం-ఇంకా ఎన్నో సాహిత్య ప్రక్రియలను వాటి మనోహర ఉపవిభాగాలతోసహా అనంత వైవిధ్యమున్న ఒక సంపదను మన రచయితలముందు పరచింది. మనవారు ముగ్ధులయ్యారు... కన్నడ వచన కవిత్వనాటకానికి షేక్సుపియర్ మార్గదర్శి. విషాదాంత నాటకానికీ, చారిత్రక నాటకానికీ, చివరకు పౌరాణిక నాటకానికి కూడా ఆయనే ఒరవడి. గోల్డుస్మిత్, షెరిడన్ కన్నడంలో నూనవ చేష్టలను ప్రదర్శించే హాస్య నాటకానికి మూల పురుషులు. సాంఘిక నాటకానికి ఇబ్సెన్, వాదము చర్చలు ఉండే నాటకానికి బెర్నార్డుషా దారిచూపారు. పో, హాతార్న్, కానన్ డాయల్ కన్నడ కథానికకు రూపరేఖలు దిద్దారు. జీవిత చరిత్రలు వ్రాసే వారికి బాస్వెల్, మెకాలే, మరికొందరు అనుసరణీయులైనారు. ఆత్మవర్ణన చేసేవారికి మిల్, టాల్‌స్టాయి, ఆస్కార్ వైల్డుల ఆత్మకథలు ఉపకరించాయి. లాంబ్, హాజ్‌లిట్ వంటి వారల వైయక్తిక వ్యాసాలు ఆ రకపు రచనలకు నమూనాలయ్యాయి. కోల్‌రిడ్జ్, ఆర్నాల్డ్, బ్రాడ్లే వంటివారి సాహిత్య విమర్శలు విమర్శనాత్మక సాహిత్యానికి ఒరవడి పెట్టాయి. కన్నడ ఛందస్సులు ఆంగ్ల ఛందోరీతులనుంచి కొంత స్వీకరించక పోలేదు. ఈ నూత్న సాహిత్య ప్రక్రియలు, ప్రేరణలు ఇతర ఆధునిక

* కవికోకిల గ్రంథావళి-4

భారతీయ సాహిత్యాలకువలెనే ఆధునిక కన్నడ సాహిత్యానికి కూడా ఎంతో ప్రాముఖ్యంకల విశేషములు'' అని గోకాక్ అన్నాడు. ఈ మాటలు భారతదేశం లోని ప్రాంతీయ భాషల సాహిత్యాలకన్నిటికీ కొద్దిగొప్ప తేడాతో వర్తిస్తాయి. రొమాంటిసిజం, రియలిజం, ప్రోగ్రెసివిజమ్, సర్రియలిజం, డాడాయిజమ్, ఎగ్జిస్టెన్షియలిజం, ట్రెడిషనలిజం, ఎథిసిజం, హ్యూమనిజం, ఎస్తెటిసిజం, నాస్టిసిజం వంటి ఇజములు, వాదనులు, ఉద్యమములు, పత్రికారచన, విజ్ఞానశాస్త్ర రచన-అన్నీ మన దేశీయసాహిత్యాలలోనూ వచ్చాయి. ఈ విధంగా ఒక్కొక్క ప్రాంతీయ సాహిత్యం అనేక అంగణములు, అంతఃపురములు, మందిరములు కల మహాసౌధంగా తయారైంది. ఈ భాషలలో 19 వ శతాబ్దికి పూర్వం చెప్పుకో దగ్గ వచనరచనే లేదు. కాని సాహిత్య పునరుజ్జీవనంతో వచనరచన మధ్య యుగాల కరకట్టలను ఛేదించుకొని ఆధునికయుగంలోకివచ్చి అనేక శైలీ భేదములతో, తీరుతోయములతో ఒప్పారుతూ ఎటువంటి భావాన్నయినా వ్యక్తంచేసే శక్తిని సముపార్జించుకొంది. ఆధునిక కవిత్వం ఎన్నోపోకడలుపోయి వైవిధ్య సమన్వితమైంది. ఆధునిక భారతదేశం యొక్క వాస్తవ అభివ్యక్తి ప్రాంతీయ భాషలలోనే జరిగింది. ప్రాంతీయ భాషలు ఇరవయ్యోశతాబ్ది ప్రథమార్థభాగం కూడా పూర్తికాకమునుపే సృజనాత్మకంగా అగ్రశేణిలో నిలిచాయి. రవీంద్రనాథ టాగూరుకు సాహిత్యానికి 1913 లో నోబెల్ బహుమతి రావడంతో భారతీయ సాహిత్యమునకు ఆధునిక ప్రపంచ పరిగణన లభించింది. రవీంద్రుడు విశ్వకవి అని కీర్తింపబడినాడు. ఈయన కవిత్వంలో ప్రకృతి, మానవుడు, పరమేశ్వరుడు ఏకకాలంలో దర్శనమివ్వడం ఒక విశేషం. జీవాత్మ పరమాత్మతో ఐక్యమగుటకై చూపు ఆతురత 'గీతాంజలి'లో దృగ్గోచరమవుతుంది. రవీంద్రునిది బహుముఖ వ్యక్తిత్వము. ఆయన నవలాకారుడు. కథానికారచయిత. నాటకకర్త. ఆలోచనాపరుడు. తత్త్వవేత్త. సౌందర్యోపాసకుడు. కళారాధకుడు. గాయకుడు. నటుడు. చిత్రకారుడు. ఒక నూతన విద్యావిధానాన్ని ప్రవేశపెట్టిన విద్యావేత్త. ఆధ్యాత్మిక సాధకుడు. 'జనగణమన అధినాయక జయహే భారత భాగ్యవిధాతా' అను భారత జాతీయగీతం రవీంద్రుని రచన. ఆయన కృతులు భారతీయ సాహిత్యానికి నూతనోజ్జీవంకల్పించి, వంగ భూమిని బంగారు నేలను చేశాయి. ఆయన జీవితం విశ్వమానవ సౌభ్రాత్రము అనే ఆదర్శానికి ప్రతీకగా భాసించింది. నోబెల్ బహుమతిపొందిన రవీంద్రుని 'గీతాంజలి'కి పీఠిక వ్రాస్తూ డబ్ల్యు. బి.

ఏట్స్ ''ఈ కవిత్వం నాకు తెలిసినంతవరకూ ఎంత నిరాడంబరంగా, ఎంత యథేష్టముగా ఉన్నదంటే మీ దేశంలో నూత్న పునరుజ్జీవనం ఆవిర్భావం జరిగింది. అది వినికిడివల్ల తప్ప లేకపోతే నాకు తెలియవచ్చేదే కాదు సుమా!'' అంటూ తన ఆశ్చర్యాన్ని ప్రకటించాడు. శరత్‌చంద్ర చటర్జీ (1876-1938), ప్రేమ్‌చంద్ (1880-1936), కాజీనజ్రుల్ ఇస్లాం (1899-1977) వంటి రచయితలు ఎందరో భారత సాహిత్యరంగంపై వెలిశారు. ఆధునిక సాహిత్యం విరివిగా పెంపుజెందింది.

ఆధునిక భారతీయభాషలలో మాత్రమే నవ్యసాహిత్యం రాలేదు. మృత భాష అని చెప్పబడ్డ ప్రాచీన సంస్కృత భాషలో కూడా పునరుజ్జీవనంతో ఆధునిక సాహిత్యం చాలావచ్చింది. సంస్కృతం ఎంతో అభివృద్ధి చెందింది. ప్రజా జీవితంలో వచ్చిన నూతన సాంఘిక రాజకీయోద్యమాలు సంస్కృత రచయితలను ప్రభావితం చేశాయి. సంస్కృత భాషలో ఎన్నో పత్రికలు వెలువడ్డాయి. పాశ్చాత్య శ్రేష్ఠగ్రంథాలను (classics) సంస్కృతంలోకి అనువదించారు. ఖండకావ్యం, నవల, నాటకం, నాటిక, జీవితచరిత్ర, విజ్ఞాన శాస్త్రం, అధిక్షేప రచన, పాశ్చాత్యపద్ధతిపై విమర్శ సంస్కృతంలోనూ వచ్చాయి. ప్రాంతీయ భాషలలోని ఉత్తమ రచనలను సంస్కృతంలోకి అనువదించి ప్రాంతీయ సాహిత్యాన్ని ప్రపంచానికి పరిచయం చేయడం జరిగింది. ఈవిధంగా సంస్కృతం మరల జీవద్భాషయై సమకాలిక జీవితాన్ని చిత్రించడానికీ, నూతన భావాలను వెల్లడించడానికీ తగుసాధనంగా అభివృద్ధి చెందింది. రేడియోలో ప్రపంచవార్తలు చెప్పడానికి సంస్కృతాన్నికూడా ఎన్నికచేసి ఆ భాషలో రోజూ వార్తలు చెబుతున్నారంటే అది ప్రాచీన స్థితినుంచి బైటపడి నవ్యసృష్టికి తగిన ఆధునిక భాష అయిందన్నమాట. ఒక విధంగా ఇది మహత్తరమైన పునరుద్ధరణ.

బ్రిటిషు వారితో మనకు కలిగిన సంపర్కం ఫలితంగా ఇండో-ఆంగ్లియన్ సాహిత్య మనబడే (Indo-Anglian literature) ఒక కొత్తశాఖ పుట్టుకొచ్చింది. అంటే భారతీయులు నేరుగా ఆంగ్ల భాషలో చేసే సృజనాత్మక రచనలు. భారతీయులు తమ అభివ్యక్తికి ఇంగ్లీషు భాషను ఉపయోగిస్తున్నారు. ఆ భాషలో కవిత్వం, నవలలు, కథానికలు, జీవితచరిత్రలు, ఆత్మకథలు, చరిత్రలు, విమర్శలు, వ్యాసములు, తదితర రచనలు చేస్తున్నారు. వీరి

ఇతివృత్తం, వస్తువు భారతీయమే కావచ్చు. కాని రచన ఇంగ్లీషులో చేస్తారు. 1883 లోనే దేశీయ విద్యార్థులు ఇంగ్లీషులో వ్రాసిన మచ్చుతునకల వంటి రచనలతో 'ఇండో - ఆంగ్లియన్ లిటరేచర్' అనే పుస్తకం కలకత్తా నుంచి వెలువడింది. ఇదీ భారతీయ సాహిత్యమే. భారతీయ సాహిత్యంలో ఇదొక విభాగమని ప్రముఖవిద్యావేత్త డాక్టర్ సి. ఆర్. రెడ్డి (1880-1951) వంటి ఆంగ్ల విద్వాంసుడు ఆమోదించి ఉన్నాడు. ఆత్మ విశ్వాసంతో, పరిపూర్ణ సామర్థ్యమును కనపరచే కౌశలముతో ఆంగ్లములో వచన రచన చేసిన మొట్ట మొదటి భారతీయుడు రాజా రామమోహనరాయ్. 1820 లో ఆయన రచించిన "ప్రిసెప్ట్స్ ఆఫ్ జీసస్" అనే గ్రంథం ఎంతగా వాదోపవాదాలను రేపిందో అంతగా ఆంగ్లేయులచే చదవబడింది. హెన్రీ డిరోజియో (1807-1831) మొట్టమొదటి ఇండో - ఆంగ్లియన్ కవి. అరూదత్, తోరూదత్, రమేశ్చంద్ర దత్, సరోజినీనాయుడు, మన్‌మోహన్‌ఘోష్, అరవిందుడు, రవీంద్ర నాథ టాగూరు, కె. ఎస్. వెంకటరమణి, ముల్కరాజ్ ఆనంద్, హరీంద్రనాథ్ చటోపాధ్యాయ, హుమాయూన్ కబీరు, ఆర్. కె. నారాయణ్, శాంతా రామారావు, రాజారావు, కమలా మార్కండేయ, భవానీభట్టాచార్య, గాంధీజీ, జవహరలాల్ నెహ్రూ, సర్వేపల్లి రాధాకృష్ణన్, చక్రవర్తి రాజగోపాలాచారి, యదునాధ్ సర్కార్, బ్రజేంద్రనాధ్‌సీల్, ఆర్. సి. మజుందార్, కె. ఎం. మున్షీ, సర్దార్ కే. ఎం. పణిక్కర్, ఎం. చలపతిరావు, ఖుష్వంత్ సింగ్, నీరద్ సి. చౌధురి ఆంగ్ల రచనలలో అంతర్జాతీయంగా పేరుపొందినవారు. ఒకవేళ ఆంగ్లము మన దేశ పరిపాలనా భాష కాకపోయినా, జాతీయ భాషగా దేశంమొత్తానికి వేరే ఏదైన భాష నిర్ణయింపబడినా, మన దేశీయులు ఆంగ్లం చదువుతూనే ఉంటారు. ఆంగ్ల దిన పత్రికలు వెలువడుతూనే ఉంటాయి. ఆంగ్లంలో రచన చేస్తూనే ఉంటారు.ముందుముందు ఇండో-ఆంగ్లియన్ సాహిత్యం మరింత ప్రవర్ధమానం కావచ్చు.

ఆధునిక భారతదేశంలో డా॥ సునీతికుమార్ చటర్జీ (1890-1977) వంటి భాషా శాస్త్రవేత్త ఆవిర్భవించడం గొప్ప విశేషం. ఆయన సాహిత్యవేత్త. మహా విజ్ఞాని.

చరిత్ర పరిశోధనారంగంలో మంచి కృషి జరిగింది. ఎన్నో శాసనాలు పత్రాలు వెలికి తీయబడ్డాయి. ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్స్, ఇండియన్ హిస్టరీ కాంగ్రెసు, భండార్కర్ ఓరియంటల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్, భారత

ఇతిహాస సంశోధకమండలి, ఇండియన్ హిస్టారికల్ రికార్డ్స్ కమిషన్ వంటి సంస్థలు ఏర్పడి ఎంతో పరిశోధనా కార్యక్రమాన్ని నిర్వహించాయి. కేంద్రం లోనూ, కొన్ని రాష్ట్రాలలోనూ సాహిత్య అకాడమీలు ఏర్పడి భారతీయ సాహిత్యాల వికాసానికి కృషి చేస్తున్నాయి. పెద్ద మ్యూజియములు, జాతీయ గ్రంథాలయములు ఏర్పడ్డాయి.

కలకత్తా సమీపంలో బోల్పూరులో రవీంద్రుడు 1901లో స్థాపించిన శాంతినికేతనము భారతదేశంలోని అనేక ప్రాంతాల విద్యార్థులను ఆకర్షించింది. అక్కడ చదివినవారెందరో సాహిత్యకులుగా, కళాకారులుగా ప్రసిద్ధి జెందారు. ఈ సంస్థ 1921లో విశ్వభారతి విశ్వవిద్యాలయంగా రూపొంది దేశదేశాల విద్యార్థులకు కేంద్రంగా ఉన్నది.

యూరపులో రినైశాన్స్ వచ్చిన తరువాత అక్కడి పండితులు సంస్కృత భాష మహత్వమును కనుగొనడం యూరపు భావనాలోకంలో అత్యంత ముఖ్య సంఘటన అని ప్రసిద్ధ సంస్కృత విద్వాంసుడు డా॥ వి. రాఘవన్ అన్నారు. దీనివల్ల రెండు ప్రయోజనాలు చేకూరాయి. ఆధునిక విద్య బడసిన భారతీయులు తమ సాంస్కృతిక వారసత్వ మహనీయతను గ్రహించగలిగారు. పాశ్చాత్య సంస్కృత విద్వాంసులు చేసిన కృషివల్ల భారతదేశంలో సాహిత్య సాంస్కృతిక పునరుద్ధరణ ఒక క్రమ పద్ధతిపై ఎంతగానో జరిగింది. దేవభాష అని మనం చెప్పుకొనే సంస్కృత భాషకు పాశ్చాత్య విద్వాంసులు చేసిన సేవ అమోఘము, చిరస్మరణీయము. సర్ విలియం జోన్స్ (1746-1794) బెంగాల్ ఏషియాటిక్ సొసైటీని 1784 లో నెలకొల్పాడు. అదే తరువాత రాయల్ ఏషియాటిక్ సొసైటీ అయింది. మాక్స్‌ముల్లర్, రైడర్, కీత్ మొదలగు పాశ్చాత్య విద్వాంసులు వేదాలను గూర్చి, ఉపనిషత్తులను గూర్చి, కాళిదాసు, భవభూతి, శూద్రకులను గూర్చి ఎన్నో విషయాలు సకల దేశాల పండితులకు పరిచయం చేశారు. రుడోల్ఫ్ రాత్ అనే పండితుడు 1846లో "ది లిటరేచర్ అండ్ ది హిస్టరీ ఆఫ్ వేదాస్" అనే గ్రంథం రచించాడు. మాక్స్‌ముల్లర్ 1849-1875 మధ్యకాలంలో ఋగ్వేదమును శాయనుని వ్యాఖ్యాసహితంగా ప్రకటించాడు. విల్కిన్స్ భగవద్గీతను 1785లో ఆంగ్లంలోకి అనువదించాడు. జోన్స్ 1790లో "అభిజ్ఞాన శాకుంతలము" అనువాదమును ప్రకటించాడు. భారత పురావస్తు నిర్మాణాలను వర్ణిస్తూ ఫెర్గుసన్ మహత్తరమైన కృషి చేయబట్టే కళల విషయంలో భారతీయుల

ఆసక్తికి తగువిధమైన పునాదులు వేయబడ్డవి. యూరపు విద్వాంసులు ప్రాచీన భారత లిపులను శోధించి శాసనాలను పరిశోధించి ప్రకటించబట్టే భారతచరిత్రకు సంబంధించిన వివిధ యుగాల కథ విశదంగా తెలియవచ్చింది. బహుముఖంగా జరిగిన ఈ పునరుద్ధరణమే ఒక కొత్త ఉద్యమంగా పెంపుజెంది, మన ప్రాచీన సాహిత్యం ప్రపంచవిద్వాంసుల ప్రశంసలు పొందింది. భారత పునరుజ్జీవనంలో సంస్కృత పునరుద్ధరణము, దాని వ్యాప్తి ముఖ్య ఘట్టం.

అట్లే క్రైస్తవ మిషనరీలు వారి మత ప్రచారం ముఖ్యోద్దేశంగా పెట్టుకొన్నప్పటికీ దేశభాషలకూ, వాటి సాహిత్యాలకూ మహోపకారం చేశారు. అమెరికన్ మిషనరీలు 1846లోనే శిబసాగర్ నుంచి అస్సామీ భాషలో "అరుణోదయ్" అనే మాసపత్రికను ప్రకటించడమేగాక, వివిధ విషయాలపై పాఠ్యపుస్తకాలు కూడా ప్రచురించి 1882 సంవత్సరం వచ్చేటప్పటికి అస్సామీ భాషను ఒక ఆధునిక భాషగా తీర్చిదిద్దారు. అట్లే శ్రీరాంపూరు మిషనరీలు, ముఖ్యంగా విలియం కేరీ అను నాతడు సివిలియన్ ఉద్యోగులకోసం పాఠ్య పుస్తకాలు సిద్ధపరచి అచ్చువేశాడు. రైస్ అనే పండితుడు 'ఎపిగ్రాఫికా కర్నాటికా' ప్రకటించడం వల్లనే కన్నడంలో ఆధునిక పద్ధతులపై చరిత్ర అధ్యయన పరిశోధనలు మొదలయ్యాయనీ, కిట్టెల్ ప్రకటించిన కన్నడ-ఇంగ్లీషు నిఘంటువు కన్నడ సాహిత్యికులకు 1500 సంవత్సరాలుగా కూడపెట్టబడ్డ కన్నడ భాషాసంపదను అందజేసిందనీ వి. కె. గోకాక్ తెలిపారు. గుజరాతీ సాహిత్యం పెంపుకు ఫాక్సీలు కూడా కృషిచేసి రచనలు వెలయించారు. తెలుగుభాషకు క్యాంప్‌బెల్, టి.సి. మారిస్, హెచ్. మారిస్, సి. పి. బ్రౌన్ (1798-1884) గారలు, క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీ మద్రాసువారు చేసిన సేవ చిరస్మరణీయమైనది. తమిళంలో ముఖ్యంగా నిఘంటు రచన విషయంలో క్రైస్తవ మతప్రచారకుల కృషి ప్రశంసింపదగినది. తమిళ ప్రాచీన కావ్యాల పునరుద్ధరణలో ఉ. వే. స్వామినాథ అయ్యర్ వంటి పండిత పరిశోధకులు విస్మృతి గర్భంలో పడిపోయే ప్రమాదమున్న ఎన్నో గ్రంథాలను వెలుగులోకి తెచ్చారు. 19వ శతాబ్ది ఉత్తరార్ధమున ప్రొటెస్టెంట్ మిషనరీలు మలయాళమున లక్షణ గ్రంథములు, నిఘంటువులు, సులభశైలిలో వ్రాయబడిన పుస్తకములు ప్రచురించారు. మలయాళమున ప్రామాణికమైన నిఘంటువును కూర్చిన చిరయశస్సు జర్మన్ మిషనరీయగు డా॥ గుండర్టుకు దక్కినదట. అతడు 1868 సంవత్సరమున ఒక వ్యాకరణం

కూడా ప్రకటించాడట. ముద్రణ భాగ్యము నొందిన మొదటి మలయాళ పుస్తకము సంక్షేప వేదార్థము అనీ, అది 1772లో రోమ్‌లో అచ్చువేయబడిందనీ తెలుస్తున్నది.

వివిధ ప్రాంతీయ భాషలలో తాళపత్ర గ్రంథాలుగా ఉన్న కావ్యాలు ముద్రణా యంత్రము వచ్చిన తరువాత పాఠకుల అందుబాటులోకి వచ్చాయి. అట్లే ఆయా భాషలలో ఉన్న జానపద వాఙ్మయమును ఉత్సాహవంతులు దీక్షా పరులు అయిన భాషాసేవకులు సేకరించి పరిష్కరించి ప్రకటించారు. అమూల్యమైన మన వారసత్వం మనకు దక్కింది. కొన్ని తరాల క్రిందటి జానపద గేయాలు మనకు లభ్యమయ్యాయి. జానపదగేయ సాహిత్యంపై పరిశోధనలు చేసి సిద్ధాంతవ్యాసాలు సమర్పించి ఎందరో మన విశ్వవిద్యాలయాలనుంచి డాక్టొరేట్ పట్టాలు పొందారు. కొంత జానపద సాహిత్యం ఆంగ్లంలోకికూడా అనువదింపబడి పాశ్చాత్యులకు తెలియ వచ్చింది. ఈ సందర్భంలో దేవేంద్ర సత్యార్థివంటి వారల కృషి స్మరింపదగింది.

## కళలు

భారతదేశంలో వచ్చిన పునరుజ్జీవనం ఫలితంగా కళారంగంలో కలిగిన గొప్పపరివర్తనం బెంగాలులోని నూత్న భారతీయ చిత్రకళా సంప్రదాయమని జేమ్స్ హెచ్. కజిన్స్ అన్నాడు. అంతకుముందు రాజా రవివర్మ (1848–1906) పాశ్చాత్య కళలోని కొన్ని లక్షణాలను జాతీయ సంప్రదాయంతో మేళవిస్తూ భారతీయ ఇతివృత్తాలనే వస్తువులుగా స్వీకరించి తైల వర్ణములను ప్రప్రథమముగ వాడుతూ ఎన్నో చిత్రాలు రచించాడు. వాటికి ఎన్నో ప్రతులు తీయడం వల్ల ఎక్కడ పడితే అక్కడ అవి కన్పించాయి. కాని అది స్వచ్ఛ నిసర్గభారత కళాశైలి కాదని ప్రసిద్ధులైన వారే విమర్శించి ఉన్నారు. ఆపై స్వచ్ఛమైన భారతీయ చిత్రలేఖనారీతిని వెలయింప జేయడానికి కొందరు కృషి చేశారు. వీరిలో ప్రముఖుడు అవనీంద్రనాథ టాగూరు (1871-1951). ఈయనకు ఉత్తేజం కలిగించినవాడు ఇ. బి. హావెల్ అనే ఆంగ్ల చిత్రకళా వేత్త. అవనీంద్రుని శిష్యులు స్వీయ ప్రతిభా సంపత్తులతో భారత చిత్రలేఖనా సంపదకు విశిష్టత చేకూర్చారు. వీరివల్ల నూత్న వంగ సంప్రదాయం అవతరించింది. నందలాల్‌బోసు, జామినీరాయ్, అమృతాషేర్‌గిల్, చుగ్తాయి

భారతీయ చిత్రకళను ఉన్నత శిఖరాలకు గొనిపోయారు. విశ్వకవి రవీంద్రుడు కూడా చిత్ర లేఖనం చేశాడు. ఆయన అనుసరించినది భావానుగామియగు స్వేచ్ఛందరీతి అని చిత్రకళా వ్యాఖ్యాతలు అంటారు.

వాస్తు శిల్పం విషయంలో మొదట దేశీయమగు హిందూ-ఇస్లామిక వాస్తువు ఆదరింపబడిననూ కాలక్రమమున పాశ్చాత్య వాస్తువుదే పైచేయి అయింది. కొత్త ఢిల్లీ నగర నిర్మాణం, ఉస్మానియా విశ్వ విద్యాలయ భవనం, చండీఘర్ పట్టణం ఈ కాలంలోని నవ నిర్మాణాలు.

బహు సంఖ్యాక వ్యక్తుల సంవాద శిల్పంలో దేవీ ప్రసాద్ రాయ్ చౌధురి ప్రపంచ ప్రసిద్ధుడు. ఈయన చిత్రకారుడు కూడా.

అజంతా గుహలు 1819లో కనుగొనబడినవి. ఇవి ఆంధ్రసాతవాహన చక్రవర్తుల కాలపు శిల్ప చిత్ర లేఖనముల అనన్య రామణీయకతను వెలువరచు గుహాలయములు. ఆధునిక భారత చిత్రకారులు ఎందరికో ఇవి ఒరవడి పెట్టి ఉత్తేజం కలిగించాయి.

ఉస్తాద్ అల్లాఉద్దీన్‌ఖాన్ (1862 - 1972), విష్ణుదిగంబర్ పాలుస్కర్, విష్ణునారాయణ్ భాత్‌ఖండే మున్నగువారు హిందూస్తానీ సంగీత ప్రవర్తనకై అనితరసాధ్యమగు కృషి చేశారు. పాశ్చాత్య వాద్యములలో వయొలిన్ కర్ణాటక సంప్రదాయ పండితుల ఆదరణను చూరగొన్నది. పన్నాలాల్ ఘోష్, విజయ రాఘవరావు ప్రసిద్ధ వేణు విద్వాంసులు. బిస్మిల్లాఖాన్ షెహనాయిలోను, పండిత రవిశంకర్ సితార్‌లోను, ఉస్తాద్ అలీఅక్బర్‌ఖాన్ సరోద్ వాద్యంలోను జగత్ప్రసిద్ధులు. తుమరాడ సంగమేశ్వర శాస్త్రిగారు రవీంద్రుడు మెచ్చిన వైణికులు.

భారతీయ నృత్య రీతులన్నీ ఈకాలంలో మంచి వికాసం పొందాయి. ఉదయశంకర్, ఆయన భార్య అమలాశంకర్ భారతీయ నృత్య వైశిష్ట్యాన్ని దేశదేశాలలో ప్రదర్శించారు. 1936 లో నెలకొల్పబడిన అడయారు కళాక్షేత్రం భారతనాట్య కళాభివృద్ధికి ఎంతో సేవ చేసింది. శ్రీమతి రుక్మిణీదేవి అరండేలు ఈ సంస్థను వృద్ధిపరిచారు. శ్రీమతి ఇంద్రాణి రహమాన్, యామినీ కృష్ణమూర్తి విశ్వవిఖ్యాతిగాంచిన నర్తకీమణులు. ఎం. ఎస్. సుబ్బులక్ష్మి గొప్పగాయని.

భారత చలనచిత్ర పరిశ్రమకు పితామహుడు దాదాసాహెబ్ ఫాల్కే (1870 - 1944). ఇప్పుడీ పరిశ్రమ చిత్ర నిర్మాణం రీత్యా

ప్రపంచంలో ప్రథమ స్థానమాక్రమిస్తున్నది. హిందీ చిత్రాలు అనేక దేశాల ప్రేక్షకులకు వినోదాన్ని యివ్వడంలో పేరెన్నిక గన్నవి. దేవకీబోసు, శాంతారాం, సత్యజిత్‌రే, మృణాల్ సెన్ విశ్వవిఖ్యాతి నార్జించిన దర్శకులు. సైగాల్, పంకజమల్లిక్, లతామంగేష్కర్, మహమ్మద్ రఫీ ప్రపంచంలో పేర్వడసిన చలన చిత్ర నేపథ్యగాయకులు.

బొంబాయిలోని ప్రిన్స్ అఫ్ వేల్స్ మ్యూజియం, ఢిల్లీలోని నేషనల్ మ్యూజియం, ఇంకా దేశంలో అక్కడక్కడా ఏర్పడ్డ సంగ్రహాలయాలు మన పురావస్తు సంపదను చక్కగా భద్రపరిచాయి. హైదరాబాదులోని సాలార్జంగ్ మ్యూజియం ఏకవ్యక్తి సంగ్రహాలయంగా ప్రపంచంలోనే పేరెన్నికగన్నది. కలకత్తా, బొంబాయి, మద్రాసు నగరాలలో జాతీయగ్రంథాలయాలు ఏర్పడ్డాయి.

కేంద్ర సంగీత నాటక అకాడమీ, కేంద్ర లలిత కళా అకాడమీ, ఇంకా రాష్ట్ర స్థాయిలో ఇట్టి అకాడమీలు ఏర్పడి భారతీయ లలిత కళల వికాసానికి కృషి చేస్తున్నాయి.

ఇ. బి. హావెల్, ఆనందకుమారస్వామి ప్రభృతులు భారతీయకళ ఔన్నత్యాన్ని గూర్చి ఉద్గ్రంథాలు రచించి దానిని ప్రపంచానికి పరిచయం చేశారు.

భారతదేశం క్రికెట్, హాకీ, టెన్నిస్ వంటి అధునిక క్రీడల విషయంలో ప్రపంచఖ్యాతి జెందినది. విజయ్ మర్చంట్, పటోడీ నవాబు, గెవాస్కర్, చరన్‌జిత్‌సింగ్, ధ్యాన్‌చంద్, రామనాథన్ కృష్ణన్, విజై అమృతరాజ్, హరిదత్, అంతర్జాతీయ ప్రసిద్ధి జెందిన ఆటగాళ్లు. మిహిర్‌సెన్ గొప్పఈతగాడు.

## విజ్ఞాన శాస్త్రం

ఆంగ్లవిద్య, సైన్సు అధ్యయనం ఫలితంగా భారతీయులు ఆధునిక విజ్ఞాన శాస్త్రంలో నిష్ణాతులైనారు. జగదీశ్ చంద్రబోసు (1858-1937) చెట్లకు ప్రాణ మున్నదని నిరూపించాడు. ఆయన లండన్ రాయల్ సొసైటీ ఫెలో అయి, కలకత్తాలో బోసు రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ నెలకొల్పాడు. ఆచార్య ప్రఫుల్ల చంద్ర రే (1861-1944) గొప్ప రసాయన శాస్త్రజ్ఞుడు. 1895 లో ఆయన మెర్క్యూ

రియస్ నైట్రేట్ తయారుచేసే పద్ధతిని కనిపెట్టాడు. బెంగాలు కెమికల్ అండ్ ఫార్మస్యూటికల్ వర్క్సు నెలకొల్పాడు. సర్ సి.వి. రామన్ (1888-1970) 'రామన్ ఎఫెక్ట్'ను కనిపెట్టి 1930 లో భౌతిక శాస్త్రంలో నోబెల్ బహుమతి పొందాడు. శ్రీనివాసరామానుజం (1887-1920) ప్రపంచప్రసిద్ధ గణితశాస్త్రవేత్త. ఈయన విశ్వవిద్యాలయాల పట్టములు పొందకపోయినా ఈ శతాబ్దిలో గొప్ప గణితశాస్త్రజ్ఞుడుగా పేరుపొందాడు. హోమీభాభా ప్రసిద్ధ అణు విజ్ఞానశాస్త్రవేత్త. మేఘనాధసాహా, సత్యేంద్రనాధబోసు, భట్నగర్, సాహినీ, సారాభాయి, స్వామినాధన్, నార్లీకర్, నాయుడమ్మ ప్రత్యేకించి చెప్పుకోదగ్గ శాస్త్రజ్ఞులు. ప్రస్తుతం అణుశక్తి శాస్త్రంలో, అంతరిక్ష పరిశోధనా రంగంలో భారతదేశ యువశాస్త్రజ్ఞు లెంతగానో కృషి చేస్తున్నారు. కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రిసెర్చి, ఇంకా ఎన్నో పరిశోధనా సంస్థలు ఏర్పడి విజ్ఞానశాస్త్రాభివృద్ధికి బహుముఖ సేవ చేస్తూ ఉన్నవి.

ఆధ్యాత్మిక విషయంలో కూడా నవభారతంలో గొప్ప వ్యక్తులు జన్మించి తమ ఆధ్యాత్మిక జీవనంతో ప్రపంచ ప్రసిద్ధులైనారు. అట్టివారిలో ముఖ్యంగా రమణ మహర్షి (1879-1950) ని పేర్కొనవలసి ఉన్నది. నిరాడంబరంగా జీవించి సాధకులకు మోక్షమార్గాన్ని చూపిన అధ్యాత్మ విదుడాయన. మహాజ్ఞాని. చలంవంటి స్వేచ్ఛామార్గానురక్తులు ఆయనను భగవాన్ అని అభివర్ణించారు. అట్లే సాధు వాస్వాని (1879-1966) నవభారత మహర్షిగా ప్రసిద్ధికెందాడు. సింధు రాష్ట్రంలో జన్మించిన ఈయన పూనాలో పరలోకగతుడైనాడు. దాదా వాస్వాని కవి, దేశభక్తుడు, విద్యావేత్త, జీవకారుణ్యం మూర్తీభవించిన ఋషి. ఈ విధంగా భారతదేశంలో వివిధ ప్రాంతాలలో ఎందరో యోగిపుంగవులు, బాబాలు ప్రభవించి సర్వమతములలోని ఏకత్వమును చూపెట్టి, మానవాళిలో ఆధ్యాత్మికదృష్టిని పెంపొంద జేశారు.

# 8. ఆంధ్రదేశంలో పునరుజ్జీవనం

ఆధునిక యుగంలో బెంగాలులో, తద్వారా సకలభారతదేశంలో సర్వతో ముఖ పునరుజ్జీవనానికి రాజా రామమోహనరాయ్ మూల పురుషుడు కాగా ఆంధ్ర దేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనానికి వైతాళికుడు కందుకూరి వీరేశలింగం పంతులుగారు (1848-1919). రామమోహనుడు మరణించిన 15 సంవత్సర ములకు పంతులుగారు జన్మించారు. 'పంతులుగారి వ్యక్తిత్వము రూపురేకలు దిద్దుకొనుచున్న కాలమునకు రామమోహనరాయలు మరణించి నలుబది సంవత్స రములు గడచినవి.' పంతులుగారు ఆంధ్ర ప్రజాజీవనరంగంపైకి రాకపూర్వం ఆంధ్రదేశం సాంఘికంగా, సాహిత్య విషయకంగా, సాంస్కృతికంగా మధ్య యుగాల క్షీణస్థితిలో ఉన్నది. ఆయన వచ్చి ఈ ప్రాంతాన్ని ఆధునిక యుగంలోకి ప్రవేశపెట్టాడు. పంతులుగారికి పూర్వం తెలుగులో వచనరచన కొంత జరిగింది ఆంగ్ల సాహిత్య ప్రభావం కూడా పడింది. ముద్రాక్షరశాలలు ఏర్పడి తెలుగు పుస్తకాలు అచ్చు అవుతూ ఉన్నవి. క్రైస్తవ మిషనరీలు, కొందరు ఆంధ్రులు నిఘంటువులను, వ్యాకరణములను, స్థానిక చరిత్రలను సేకరించి ప్రకటించే విషయంలో చాలా కృషి చేశారు. ఈ సందర్భంలో జె.సి.మారిస్(1798-1858), సి.పి. బ్రౌన్(1798-1884)ఎ.డి. క్యాంప్‌బెల్,కర్నల్ మెకంజీ(1753-1821), గెరెట్టీ, కావలి వెంకటబొర్రయ్య(1776-1803) గారల కృషి పేర్కొనదగింది. ఇంగ్లీషు చదువులు వచ్చిన తరువాత అప్పటి ప్రభుత్వం ప్రజలకు వారి భాష లోనే విద్యావిజ్ఞానములను సమకూర్చవలెనని ప్రయత్నించింది. కాని తెలుగులో ఆధునికమైన వచన రచన ఏది? చిన్నయసూరి (1806-1862) తెలుగువచనాన్ని పాత ఫక్కీలో వ్రాసి దానిని కొన్ని దశాబ్దాలు వెనక్కి తీసుకెళ్ళాడు. అది ఆధు నిక విషయములు, శాస్త్రములు బోధించడానికి ఉపకరించే వచనం కాదు.అప్పటి పరిస్థితిని గూర్చి వ్రాస్తూ గెరెట్టీ అనే ఆంగ్లేయుడు "విద్యావంతుడైన ఆంధ్రుడు తెలుగులో ఆలోచించి, తెలుగులో తన భావాలను వ్యక్తం చేయడు. ఇంగ్లీషులో చేస్తాడు. తన భావాలను తెలుగులో వ్రాయడానికి బదులు తెలుగులోకి తర్జుమా

చేస్తాడు. కారణమేమిటంటే అతని ఆలోచనలు ఇంగ్లీషులో పుట్టినవి'' అన్నాడు. ఈ కారణంచేత తెలుగులో సైన్స్ పుస్తకాలను సిద్ధం చేయించడం కష్టతరమైంది. ఆధునిక విజ్ఞానం విద్యార్థులకు అందజేయడం సాధ్యంకాలేదు. అయితే ఇందుకు ఆంగ్లవిద్యను నిందించడం న్యాయంకాదు. ఇది ఆంగ్ల విద్యవల్ల వచ్చిన అనర్థం కాదు. అలా అనడం కుతర్కం అనిపించుకొంటుంది. ఇంగ్లీషును చూచి మన మాతృభాషలో వచన రచనను ఆధునికం చేసుకోలేకపోవడం మన అసమర్థత, మన లోపం. ఒక భాషను చూచి అయినా మనం మన భాషను వృద్ధిచేసుకోవల సింది. కాని ఆ పని మనవారు చేయలేదు.

బెంగాలులోవలెనే ఆంధ్రదేశంలో కూడా సంఘ సంస్కరణోద్యమం, నూతన సాహిత్యసృష్టి ఏకకాలంలో జరిగాయి. భారతదేశంలో వచ్చిన సంఘ సంస్కరణోద్యమాలన్నింటి ప్రభావం ఆంధ్రదేశంపై పడింది. ముఖ్యంగా బ్రహ్మసమాజం, ఆర్యసమాజం, దివ్యజ్ఞానసమాజం. ఏదైనా, కొత్తదానికి స్వాగతం చెప్పే స్వభావం ఆంధ్రులది. అల్లే ఆ ఉద్యమాలకు స్వచ్ఛందంగా మనః స్ఫూర్తిగా స్వాగతం చెప్పి వాటిలో పాల్గొని తమ నూత్న జీవితాన్ని దిద్దు కొన్నారు. ఆంధ్ర సంస్కరణోద్యమానికి ఉదయతార ఆధునికయుగ ప్రవర్తక వీరేశ లింగం. ఆయనపై రామమోహనుని ప్రభావమూ, బ్రహ్మసమాజ ప్రభావమూ ఉన్నాయి. ఆయన "మానవతావాది. అకలంక నీతి వర్తనుడు. బోద్ధ. దాత. త్యాగి. పరోపకారి. ఏకేశ్వరోపాసకుడు. కుల వర్గ వర్ణ మత వివక్షల కతీతుడు. దీనుల సేవచేసిన మహనీయుడు. సంఘోద్ధరణము నకై తనువెత్తిన పుణ్యమూర్తి. ప్రాత క్రొత్తల మేలుకలయికను విన్నాణముగా తీర్చిదిద్దిన మహానుభావుడు. తెలుగుదేశమందు ప్రబలిన సాంఘిక చైతన్యము నకు, ప్రగతికి మూలపురుషుడు.''* కాబట్టే "వీరేశలింగం చేతి దెబ్బలకు ఆంధ్ర జాతి నిద్రలోనుంచి కాస్త ఒత్తిగిల్లి ఒళ్ళు విరుచుకొని కళ్ళు నులుముకొని అప్పుడే ఆవులించి కూర్చున్న రోజులవి'' అని దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఒక సందర్భంలో వ్రాశారు. "ఆంగ్ల సారస్వత ప్రపంచమున నశేషఖ్యాతినార్జించిన మహనీయుల సాహితీ ప్రాగల్భ్యమును పంతులుగారు క్షుణ్ణముగా నవలోడనము చేసి ఆయా మార్గములను బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమున నెలకొల్పుటకు

---

* డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారి థీసిస్ 'వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన' నుండి. 1972.

కృషిచేసిరి''* పంతులుగారు తమ సంస్కరణోద్యమానికి సాహిత్యాన్ని ఆయుధంగా చేపట్టినప్పటికీ, తెలుగులో ఆధునిక సాహిత్యాన్ని వృద్ధిచేయవలెనన్న సంకల్పబలం ఉన్నవారు. వారికి ముందు అక్కడక్కడ ఒకరిద్దరు నూతన ప్రక్రియలందు రచనలు చేసినప్పటికీ సర్వతోముఖమైన ఆంధ్ర వాఙ్మయ వికాసానికి అన్ని నూతన ప్రక్రియలలో రచనచేసి తెలుగు సాహిత్యాన్ని ఆధునిక యుగంలోనికి గొనివచ్చిన ఘనత, కీర్తి వీరేశలింగం పంతులుగారికే చెందుతాయి. నవల, కథావాఙ్మయము, నాటకము, వ్యాసము, ప్రహసనము, పద్యకావ్యము, జీవిత చరిత్ర, స్వీయచరిత్ర, ఆంధ్రకవుల చరిత్రవంటివి వ్రాయడమేకాక, జంతు, జీవ, ఖగోళ, భూగోళ, పదార్థ విజ్ఞాన శాస్త్రాలలో వచన గ్రంథాలు రచించి, తెలుగుభాషా బోధనకు బాలశిక్ష మొదలు పై తరగతులవరకు వాచకములు రచించి తెలుగు భాషను ఆధునిక విద్యకు అనుగుణంగా తీర్చిదిద్దారు. ఆంగ్లేయ వాఙ్మయంలోని కొన్ని రచనా విధానాలను, సంప్రదాయాలను తెలుగులో వెలయించారు. అయితే వీరేశలింగం తరంవారు ఆంగ్లములో 17 నుంచి 19 శతాబ్దాల సాహిత్యంమీది మక్కువచేతనూ, సంస్కృత కావ్యాల ఆకర్షణము వల్లనూ నవ్య కవిత్వ సృష్టికి కృషి చేయలేకపోయారు. వారికి అట్టి వ్యవధానం కూడా లేదు. నూతన సమాజానికి, నూతన సాహిత్యానికి పునాదులు వేయడంలోనే వారి జీవితం గడచిపోయింది.

తెలుగులో నవీనమైన నవ్యకవిత్వాన్ని ప్రవేశపెట్టినవారు గురజాడ అప్పారావు (1861-1915), రాయప్రోలు సుబ్బారావు (1892-). వీరిలో ఎవరు యుగకర్త అన్న విషయంలో కొంత భేదాభిప్రాయం ఉన్నది. 'అభినవాంధ్ర సాహిత్యము' అను వ్యాసంలో ** దువ్వూరి రామిరెడ్డి (1895-1949) గారు ఇట్లా వ్రాశారు: ''అప్పారావుగారి ముత్యాల సరములతో అభినవ కవితోద్యమము ప్రారంభమయినది... ఈ నవయుగ కవితా ప్రభాతము యొక్క ప్రథమ రోచులు రాయప్రోలు సుబ్బారావుగారి కుటీర గవాక్షములో ప్రసరించి ఆయనను

---

* డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారి థీసిస్ వ్యాసం 'వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన' నుండి. 1972.

** 'కవికోకిల గ్రంథావళి - 4'

ప్రబోధించినవి ... పిఠాపురమున సుబ్బారావుగారు స్థాపించిన అభినవకవితా మండలిని గురించిన యొక కరపత్రమును నేను చూచితిని. ఆంగ్లేయ సాహిత్యము లోని పేరిన తేనెగడ్డలను అభినవాంధ్ర కావ్యములలోనికి తెచ్చుట ఆ మండలి యుద్దేశములలో నొకటియని అందు వ్రాయబడి యుండినది. ప్రథమమున సుబ్బారావుగారి యుద్దేశమెట్లుండినను తరువాత వారు రచించిన కావ్యములు స్వతంత్ర సృష్టులనియే చెప్పవలయును.'' ఇది రామిరెడ్డిగారి అభిప్రాయంకాగా, డా. సి. నారాయణరెడ్డిగారు ''రసగుళికలవంటి రమ్యకావ్యములను సృష్టించిన కవి రాయప్రోలు సుబ్బారావుగారు. వీరు గురజాడవలె ఒక్కుమ్మడిగా సంప్రదాయమున కెదురు దిరిగిన వారు కారు. సంప్రదాయమునకు లోబడిన వారును కారు. నవ్యకవిత్వయుగకర్తలు వీరు'' అంటూ, గురజాడ అప్పారావుగారిని మొదటి యుగ కర్తగానూ రాయప్రోలు వారిని రెండవ యుగ కర్తగానూ పేర్కొన్నారు. * ఇద్దరి రచనల మధ్య కొన్ని నెలల తేడా మాత్రమే ఉంటుందని కొందరు అంటారు. అయితే ఎవరికి వారు దూరంగా ఉండి స్వతంత్రంగా రచనలు చేశారు. ఇద్దరినీ యుగకర్తలుగా ఆమోదింపవచ్చు. వీరిద్దరి ప్రభావమూ వీరి తరువాత వచ్చిన కాల్పనిక కవులపై ఉన్నది. రాయప్రోలులో కవిత్వసంపద ఎక్కువ. అందులో ఆంగ్ల, వైష్ణవ ప్రభావం ఉంది. కొంత ప్రాచీన వాసనా ఉంది. గురజాడ పూర్తిగా ఆధునికుడు. ఆయనది పురోగామి దృక్పథం. తన కాలానికి చాలా ముందుకు పోయి ఆయన నిల్చున్నాడు. తెలుగు భాష విషయంలో పునరుజ్జీవనోద్యమం సందర్భంగా వచ్చినది గిడుగు రామమూర్తి (1863-1940) పంతులుగారి వ్యావహారిక భాషోద్యమం. ఇది ప్రగతి శీలకమైనది. దూరాలోచనతో కూడిన ఉద్యమం. నవ్యసాహిత్యానికి ఎంతైనా తగినది. గురజాడ ఈ వ్యావహారిక భాషోద్యమాన్ని సమర్థిస్తూ, వీరేశలింగం పంతులుగారి సంఘ సంస్కరణోద్యమానికి చేయూతనిస్తూ 1897లోనే 'కన్యాశుల్కము' అనే అత్యాధునిక సాంఘిక నాటకం రచించారు. ఏమైనా ఇద్దరూ ఆంగ్ల విద్య, పాశ్చాత్య సంపర్కపు ప్రభావంచే మౌలికమైన ప్రతిభతో అభినవాంధ్ర సాహిత్యాన్ని నిర్మించారు. ఈ మార్పును గూర్చి వ్రాస్తూ దువ్వూరి రామిరెడ్డిగారు

---

* డా॥ సి. నారాయణరెడ్డిగారి థీసిస్ వ్యాసము 'ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు : ప్రయోగములు' 1967.

''ఆంగ్లేయుల సంబంధము వలన పాశ్చాత్య నాగరికతతో మనకు పరిచయము కలిగినది. వారి వాఙ్మయము, వారి ప్రకృతి విజ్ఞానము మనదృష్టి నాకర్షించినవి. వారి పరిపాలనా పద్ధతి మనయందు స్వాతంత్ర్యేచ్ఛ పురికొల్పి జాతీయైక్యమును పెంపొందించినది. సంఘమునందవతరించిన ఈ నూతన స్వాతంత్ర్య ప్రియత్వము రాజకీయ విషయములందేకాక వివిధ సాంఘిక చర్యలయందును తల సూపినది. కట్టుబాట్లకు లోనయి బహిర్వ్యాప్తిని కోల్పోయిన సర్జన శక్తులు నేడు సంకుచితావరణమునుండి వెలికురికి ఆత్మోచిత కార్యకల్పనకు సిద్ధములైనవి. వాఙ్మయము సాంఘిక జీవనము యొక్క ప్రతిబింబమే కావున, సంఘమున చెలరేగిన ఈ సంచలనము, ఈ ఆందోళనము, ఈ స్వాతంత్ర్యేచ్ఛ దానియందు మాత్రమెట్లు కానరాకుండును?'' అన్నారు.* ప్రాచ్య పాశ్చాత్య నాగరికతా సమ్మేళనము వలన మన సాహిత్య నిర్మాతలు కొత్తవారైనారు. వీరికి కొన్ని నూతనాశయము లలవడినవి.

ఈ ఇద్దరు యుగ కర్తల తరువాత తెలుగుకవిత్వరంగంలో కాల్పనికోద్యమం వచ్చింది. నవ్యసాహిత్య పరిషత్తు ఏర్పడింది. కృష్ణశాస్త్రి (1897-1980) వంటి కవి ఆవిర్భవించాడు. అభ్యుదయ కవిత్వోద్యమం వచ్చింది. దానికి శ్రీశ్రీ ప్రతినిధి. సంప్రదాయ కవిత్వము, అభ్యుదయ కవిత్వం రెండూ సమానంగా వ్రాయగల దాశరధివంటి నియోక్లాసికల్ కవులున్నారు. ఇంకా సర్రియలిజం, డాడాయిజం వంటి యూరపు రీతులన్నీ వచ్చాయి. మన కవికుమారులు వాని ననుసరించి రచనలు చేశారు. అపారమైన కవిత్వ సంపద ఆంధ్రలో పుట్టుకొచ్చింది. ఇది గర్వకారణమైన నవ్య సృష్టి. భారతదేశంలో ఏ ప్రాంతానికీ తీసిపోనట్టిది. ఆ మాటకొస్తే మనకున్నంత స్వచ్ఛనిసర్గమైన కాల్పనిక కవిత్వం ఏ ఇతర భారతీయ భాషకూ లేదు. మన కవులు, రచయితలు మానవతా వాదానికీ, హైందవ జాతీయోద్యమానికీ, స్వాతంత్ర్య సమరానికీ, ప్రత్యేక రాష్ట్రోద్యమమైన ఆంధ్రోద్యమానికీ, సామ్యవాద ప్రాచుర్యానికీ, ఇంకా ఇతర ఉద్యమాలకూ ఎంతగానో తోడ్పడ్డారు.

ఇట్లా దినదిన ప్రవర్థమానమైన ఆధునిక సాహిత్యోద్యమంలో ఉత్తమ నవలా రచయితలు, నాటక కర్తలు, నాటికా రచయితలు, కథకులు,

---

* 'కవికోకిల గ్రంథావళి —4.'

విమర్శకులు ఎందరో పుట్టుకువచ్చారు. ఆయా రంగాలలో ఉత్తములైన వారినే పేర్కొనవలెనంటే ఒక్కొక్కదానికి ఒక పెద్ద జాబితా తయారు అవుతుంది. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి 'మాలపల్లి' నవల గాంధీ యుగాన్ని ప్రతిబింబింపజేసిన ధర్మేతిహాసం. 1970 లో జ్ఞాన్‌పీఠ్ బహుమతి పొందిన తొలి ఆంధ్రుడు విశ్వనాథ సత్యనారాయణ (1895–1976) తెలుగు దేశంలో పునరుద్ధరణకు ఏకైక నాయకుడుగా ధ్రువ నక్షత్రంవలె వెలుగొందుతాడు. చలం (1894-1979) ఒక ప్రవృత్తిని చిత్రించాడు. త్రిపురనేని రామస్వామి చౌదరి (1887-1943) హేతువాదంతో పునరుజ్జీవనంలో ఒక ముఖ్యాంశమైన విచారణా తత్త్వాన్ని తెలుగు సాహిత్యంలో ప్రవేశపెట్టాడు. పాలగుమ్మి పద్మరాజుగారి కథ 'గాలివాన'కు 1950లో ప్రపంచ కథానికల పోటీలో బహుమతి లభించి తెలుగు కథ ఖండాంతర ప్రశస్తి నార్జించింది. ఒక్కొక్క ప్రక్రియలో తెలుగు సాహిత్యం ఎంతగా విస్తృతమైందంటే, ఒక్కొక్క రచయిత తన రచనల శ్రేష్ఠత్వం వల్ల ఎంతగా ఎదిగి ఉన్నత పీఠమధిష్ఠించాడంటే మన విశ్వవిద్యాలయాలలో డాక్టొరేట్ పట్టములకు పరిశోధన చేసేవారికి ఇప్పుడు కావలసినన్ని విషయాలు లభ్యమవుతున్నాయి. ఈనాడు భారత దేశంలో– ఆ మాట కొస్తే యూరపులో కూడా మున్నెన్నడూ లేని విధంగా తెలుగు రచయితులు కథా సాహిత్యాన్ని ఎంతో వైవిధ్యంతో సృష్టించి పాఠకుల సంఖ్యను ఎన్నడూ లేనంతగా పెంచారు. ఇందరు రచయిత్రులు ఏ భాష వారికున్నారు? ఆంధ్రజాతి పునరుజ్జీవనంలో సాహిత్యానిదే పెద్ద పీట గా కన్పిస్తుంది. ఈ సాహిత్య సౌధం దివ్యమైనదిగా కనిపిస్తుంది. దీని వైభవాన్ని ఎరిగిన వారు కాబట్టే దేవులపల్లి రామానుజరావుగారు "ఈనాటి తెనుగు సారస్వత వాహిని సంస్కృతాంగ్లేయ వాఙ్మయ వాహినులతో సంగమించి త్రివేణి సంగమ సౌందర్యమును ధిక్కరించుచున్నది. ఆంగ్ల భాషా వ్యాసంగము ఆంధ్ర భావ కవికుమారులను స్వేచ్ఛారక్తులుగను, ఆశయ పూరితులుగను జేసి సహజభావనా మహిమకు దోహదమొసంగి ఉజ్జ్వల భావపూరితములగు రచనల నుద్దీపింప జేసినది. ఆంగ్ల సహాయమున విశ్వసాహిత్యముతో సంపర్కముగలిగి ఆంధ్ర సాహితీ దృష్టి విశాలమైనది" అన్నారు.*

---

* దేవులపల్లి రామానుజరావుగారి గ్రంథము 'సారస్వత నవనీతము', మొదటి ముద్రణ 1955.

ఆంధ్రదేశంలో స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా సాగింది. ప్రకాశం (1871-1957) వంటి ప్రజానాయకుడు దక్షిణ భారత జాతీయోద్యమానికే ఎంతో ఉత్తేజమిచ్చి ఎందరో దేశభక్తులను తయారుచేశాడు. ప్రత్యేక రాష్ట్రం కోసం 1913లో ఆరంభమైన ఆంధ్రోద్యమం ఫలితంగా అమరజీవి పొట్టి శ్రీరాములు ఆత్మాహుతితో 1953 అక్టోబరు 1వ తేదీన కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. ఆ తరువాత హైదరాబాదు రాష్ట్రాన్ని మూడు భాగాలుగా విభజించి తెలంగాణాను ఆంధ్రతో చేర్చి హైదరాబాదు రాజధానిగా 1956 నవంబరు 1వ తేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటు చేశారు. ఎప్పుడో కాకతీయులకాలం తర్వాత విడిపోయిన ఆంధ్రప్రాంతాలన్నీ తిరిగి స్వతంత్ర భారతంలో ఏకపాలన క్రిందికి రావడం ఆంధ్రపునరుజ్జీవనోద్యమంలోని ముఖ్యవిశేషం. 19వ శతాబ్దిలో పెద్ద నిర్మాణాలు జరిగాయి. సర్ ఆర్థర్ కాటన్ కృషివల్ల 1852 లో ధవళేశ్వరం వద్ద గోదావరి ఆనకట్ట నిర్మింపబడింది 1855 లో బెజవాడ వద్ద కృష్ణానదికి ఆనకట్ట నిర్మించారు. 1893 లో తెలుగుదేశంలో మొదటి రైలుమార్గం వేయబడింది. 1918 లో ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదులో నెలకొల్పబడింది. 1926 లో వాల్తేరులో ఆంధ్ర విశ్వవిద్యాలయం, 1954 లో తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, 1964 లో రాజేంద్ర నగర్‌లో ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం, 1972 లో హైదరాబాదులో జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం, 1974 లో హైదరాబాదులో కేంద్ర విశ్వవిద్యాలయం (Universiry of Hyderabac) ఏర్పడ్డాయి. 1886 లోనే తెలుగుదేశంలోని మొదటి గ్రంథాలయమైన సరస్వతీనిలయం విశాఖపట్నంలో స్థాపించబడింది. 1901 లో శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయం హైదరాబాదులో ఏర్పాటైంది.

పాశ్చాత్య సంయోగమున మన కలవడిన కొత్త విద్యలలో చరిత్ర పరిశోధన ఒకటి. అంతకుపూర్వం మనవారు చరిత్రయొక్క ప్రాముఖ్యాన్ని అంతగా గుర్తించి ఉండలేదు. చరిత్ర పరిశోధన భరత ఖండము నందలి అన్ని ప్రాంతములకంటెముందే ఆంధ్రదేశంలో ఆరంభమైంది.* క్రీ॥ శ॥ 19వ శతాబ్ది

* డా॥ నేలటూరి వెంకటరమణయ్యగారి వ్యాసం "భారతి" రజతోత్సవ సంచికలో, జనవరి 1949.

పూర్వార్ధంలో కర్నల్ కాలిన్ మెకంజీ (1753–1821), ఆయన గుమాస్తాయైన కావలి వెంకట బొర్రయ్య(1776-1803) దాక్షిణాత్య చరిత్ర రచనకు అమూల్యమైన సేవ చేశారు. కొమర్రాజు వెంకటలక్ష్మణరావు(1877-1923) పంతులుగారు 1906 లో విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి అను సంస్థను స్థాపించి ఆంధ్రాభ్యుదయం కొరకు సేవ చేశారు. ఆయన చరిత్ర రచయిత, శాసన పరిశోధకుడు. ఈ సంస్థ ఎన్నో చరిత్ర గ్రంథాలు, వైజ్ఞానిక గ్రంథాలు ఆధునిక పద్ధతులనను సరించి ప్రకటించింది. లక్ష్మణరావుగారు ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమును ప్రచురించే విషయంలో కూడా కృషి చేశారు. కాని అది వారు వేసిన ప్రణాళికనను సరించి పూర్తి కాకుండా అసంపూర్ణంగా ఉండిపోయింది. 1947లో స్థాపింపబడిన తెలుగుభాషాసమితి తెలుగు విజ్ఞాన సర్వస్వం సంపుటాలను ప్రకటిస్తూ ఉన్నది. ఖండవల్లి లక్ష్మీరంజనంగారు సంగ్రహాంధ్ర విజ్ఞానకోశమును ప్రకటించారు. ఆంధ్రదేశంలో గ్రంథాలయోద్యమం స్వాతంత్ర్యోద్యమానికీ, సాహిత్యోద్యమానికీ, సమాచార విజ్ఞానముల వ్యాప్తికీ, రాజకీయ సాంఘిక చైతన్యానికీ ఎంతో తోడ్పడింది. ఈ సందర్భంలో శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారి కృషిని స్మరింపవలసి ఉన్నది.

1880లో ధార్వాడ కంపెనీవారు ఆంధ్రదేశంలో పర్యటించి వారి నాటకాలు ప్రదర్శించారు. దానితో ఆంధ్ర నాటక సాహిత్య చరిత్రలో నూతన యుగం ఆరంభమైంది. వానిని చూచి తెలుగువారు తమ నాటకాలు ఆడటం మొదలు పెట్టారు. కందుకూరి వీరేశలింగం పంతులుగారు 'అభిజ్ఞాన శాకుంతలం' నాటకం రచించి ప్రదర్శింప జేశారు. గద్య పద్య గేయాత్మక నాటకాలకు ఆద్యులు ధర్మవరం రామకృష్ణమాచార్యులు (1853-1912). తొలి విషాదాంత నాటకం రచించినదికూడా వీరే. 1897లో గురజాడ అప్పారావుగారి 'కన్యాశుల్కం' నాటకం వెలువడింది. దిగ్దంతులైన నాటక కర్తలు ఎందరో ఆవిర్భవించి పౌరాణిక, సాంఘిక, చారిత్రక నాటకాలు రచించి ఆంధ్రదేశంలో నాటకాల యుగాన్ని ప్రవేశ పెట్టారు. ఉత్తమ నటులు ఉద్భవించి ఆంధ్రులనే కాక ఇతర ప్రాంతీయులను కూడా ఆకర్షించారు. టంగుటూరి ప్రకాశం, కాశీనాధుని నాగేశ్వరరావు, కొండా వెంకటప్పయ్యవంటి పెద్దలు నాయకులు నటులగుట ఈ రంగమందలి విశేషం. ప్రతాపరుద్రీయం, హరిశ్చంద్ర, పాండవోద్యోగ

**విజయము, బొబ్బిలి,** గయోపాఖ్యానం, చింతామణి, రంగూను రౌడి అప్పటి ప్రసిద్ధ నాటకాలు. ధర్మవరం కృష్ణమాచార్యులు, వేదం వెంకటరాయశాస్త్రి, తిరుపతి వేంకట కవులు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, పానుగంటి లక్ష్మీనరసింహారావు, కోలాచలం శ్రీనివాసరావు, బలిజేపల్లి లక్ష్మీకాంత కవి అప్పటి ప్రసిద్ధ ఆంధ్ర నాటక కర్తలలో కొందరు. యడవల్లి సూర్యనారాయణ, బళ్ళారి రాఘవ, స్థానం నరసింహారావు, దొమ్మేటి సూర్యనారాయణ, కన్నాంబ, బందా కనకలింగేశ్వరరావు, గోవిందరాజుల సుబ్బారావు మున్నగువారు ప్రసిద్ధ నటులు. 1930 నాటికి తెలుగు నాటక రచయితలకు అంతర్జాతీయ నాటక సాహిత్యంతో పరిచయమేర్పడి పి. వి. రాజమన్నారుగారి 'తప్పెవరిది?' నాటికతో తెలుగు ఏకాంకికలు వచ్చాయి.ఆత్రేయ వంటి ప్రసిద్ధ నాటికా రచయితలెందరో ఆవిర్భవించారు. నాటక శిల్పంలో కొత్త రీతులు వచ్చాయి. తెలుగు ఏకాంకిక సుసంపన్నమైంది. 1929లో ఆంధ్ర నాటక కళాపరిషత్తు ఏర్పడటంతో ఔత్సాహిక నాటక రంగానికీ, సమాజాలకూ మంచి ప్రోత్సాహం లభించింది. 1957లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఏర్పడింది. ప్రస్తుతం నాటక రచన చేసేవారు కన్పించరు. నాటికా రచన మాత్రమే సాగుతున్నది. వృత్తి నాటకరంగం దాదాపు అంతరిస్తున్నట్లు కన్పిస్తున్నది.

ఆంధ్ర ప్రాంతమున చిత్రకళా పునరుజ్జీవనమునకు కారణభూతుడు అస్వాల్డ్ కూల్డ్రే. దామెర్ల రామారావు (1897–1925) 1921లో చిత్ర రచన ఆరంభించునాటికి తెలుగుదేశంలో చిత్ర లేఖనం నామమాత్రావశిష్టంగా ఉంది. రామారావు లోకోత్తర కళాఖండాలు రచించి ఆంధ్ర చిత్రకళకు యావద్భారత ఖ్యాతి లభింపజేశారు. ఆయన తరువాత ఎందరో కళాకారులు ఆవిర్భవించి పలుపోకడలలో చిత్ర రచన చేశారు. అడవి బాపిరాజు, అంకాల వెంకట సుబ్బారావు, పైడిరాజు, ఎస్. ఎన్. చామకూర్, పి. టి. రెడ్డి మున్నగువారు ప్రసిద్ధులు. అయితే ఆంధ్ర చిత్రకళా సంప్రదాయమనేది ఇంకను ప్రస్ఫుటం కావలసి ఉన్నది. 1961లో ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీ ఏర్పడింది. తలిసెట్టి రామారావు ప్రముఖ వ్యంగ్య చిత్రకారుడు. సంజీవదేవ్ చక్కని చిత్ర కళావిమర్శకుడు. 'బాపు' ప్రతిభావంతుడైన చిత్రకారుడు.

1931లో ప్రారంభమైన ఆంధ్ర చలనచిత్ర పరిశ్రమ యావత్తు దక్షిణ భారతదేశానికే మొదట మార్గదర్శకమైంది. పౌరాణిక చిత్రాలు నిర్మించడంలో

ఆంధ్రులు యావద్భారతంలోనే వాసికెక్కారు. బి. ఎన్. రెడ్డి ఉత్తమ సాంఘిక, చరిత్రాత్మక చిత్రాలు నిర్మించి మంచి అభిరుచికల దర్శకుడుగా దేశంలో పేరు పొంది దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు గెలుచుకొన్నారు. నటి శారద అనేక పర్యాయములు 'ఊర్వశి' అవార్డు పొందినది. మలయాళ చిత్రాలలో ఈమె పేరు పొందిన నాయిక కావడం ఒక విశేషం.

తత్త్వశాస్త్రంలో డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్, ధ్యానములో చింతనలో జిడ్డు కృష్ణమూర్తి, మల్లయుద్ధంలో కోడి రామమూర్తి, క్రీడలలో సి. కె. నాయుడు, వయొలిన్ వాద్యంలో ద్వారం వెంకటస్వామి నాయుడు, నటనలో బళ్ళారి రాఘవ, గాత్రి సంగీతంలో హరి నాగభూషణం, మంగళంపల్లి బాల మురళీకృష్ణ, ఘంటసాల వెంకటేశ్వరరావు, అలోపతీ వైద్య ఔషధ రంగంలో డా॥ యల్లాప్రగడ సుబ్బారావు, హరికథా కాలక్షేపంలో శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణదాసు, విజ్ఞానశాస్త్ర రంగంలో డా॥ సూరి భగవంతం, చిత్రవేష ధారణలో చంద్రశేఖరం, ధ్వన్యనుకరణలో నేరెళ్ళ వేణుమాధవ్ ఖండాంతర ప్రశస్తి నార్జించి ఉన్నారు.

తెలుగు దేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనానికి దోహదము చేసిన సంస్థలలో ఆంధ్ర సాహిత్య పరిషత్తు, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం, ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల, నవ్యసాహిత్య పరిషత్తు, సాహితీ సమితి, అభ్యుదయ రచయితల సంఘం, వావిళ్ళ ప్రచురణ సంస్థ, ఆంధ్ర సారస్వత పరిషత్తు, తెలుగు భాషా సమితి, క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీ పేర్కొనదగ్గవి. మద్రాసులోని ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం తాళపత్ర లిఖిత గ్రంథాలను సేకరించి పదిలపరచింది.

'వృత్తాంతిని' తెలుగులో మొట్ట మొదటి వార్తా పత్రిక అయినప్పటికీ తెలుగువారికి తెలుగు పత్రిక అనేది కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు (1867-1938) 1908లో 'ఆంధ్ర పత్రిక'ను బొంబాయినుంచి వార పత్రికగా ప్రకటించడంతో ఏర్పడింది. దానినే వారు 1912లో దిన పత్రికగా మార్చారు. అదే ఆంధ్రుల మొట్ట మొదటి దిన పత్రిక. 1923 డిసెంబరులో నాగేశ్వరరావు పంతులు గారు 'భారతి' సాహిత్య మాస పత్రికను ప్రారంభించ

డంతో ఆంధ్రుల సాంస్కృతికాభ్యుదయానికి ఒక చక్కని పత్రిక లభ్యమైంది. నవ్యాంధ్ర సాహిత్య వికాసానికి 'భారతి' చేసిన సేవ నిరుపమానమైనది. అప్పటికీ ఇప్పటికీ ఆగిపోకుండా ప్రచురితమవుతూ ఉన్న సాహిత్య మాస పత్రిక ఇది ఒక్కటే. ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకత్వాన వెలువడిన కృష్ణా పత్రిక (1902లో స్థాపింపబడింది) వార పత్రిక ఆంధ్రులలో రాజకీయ చైతన్యాన్నీ, సాంస్కృతిక పునరుజ్జీవనాన్నీ కలిగించడంలో ప్రముఖ పాత్ర వహించింది. కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు నెలకొల్పిన ఆంగ్ల పత్రిక 'త్రివేణి' పునరుజ్జీవనోద్యమ పత్రికగా భారత దేశమందంతటనూ వ్యాప్తి జెంది ఒక భాష వారి సాహిత్యాన్ని మరొక భాష వారికి తెలియజేయడానికీ, భారతీయ భాషా సాహిత్యాలను పాశ్చాత్యుల కెరుక పరచడానికీ, ఇండో-ఆంగ్లియన్ రచయితలకు ప్రోత్సాహమివ్వడానికీ ఎంతో సేవ చేస్తున్నది. అయినా ఆంధ్రదేశంలో తగినన్ని దిన, వార, మాస పత్రికలు లేవు. ఉన్నవి ఒకేధోరణిలో ఉంటున్నవి. రాజకీయ వార పత్రికలు సువ్యవస్థితమైనవి లేవు. ఈ శతాబ్ది ప్రథమార్ధ భాగంలో కోటంరాజు పున్నయ్య, సర్ సి. వై. చింతామణి, కోటంరాజు రామారావు, కె. ఈశ్వరదత్తు, ఖాసా సుబ్బారావు, కృపానిధి, ఎం. చలపతిరావు, ఏ. యస్. రామన్ వంటి ఆంధ్ర పత్రికారచయితలు భారతదేశంలో ఆంగ్ల పత్రికా రంగంలో ప్రముఖ స్థానమాక్రమించి ఆంధ్రులకు పేరు ప్రఖ్యాతులు తెచ్చారు. అటువంటి ఆంధ్రులకు, భారత దేశంలో హిందీ తర్వాత రెండవ స్థానమాక్రమిస్తున్న భాష వారికి తగు పత్రికలు లేకపోవడం శోచనీయం.

ఏమైనను భారత దేశంలో ఆంధ్రులు సాంస్కృతిక పునరుజ్జీవనం విషయంలో గర్వకారణమైన అభ్యుదయాన్ని సాధించారు. ఇందుకు ఆంధ్రుల ప్రసక్తి, ప్రశస్తి ఇతర రాష్ట్రాలలో వినపడటం, విదేశాలలో ఆంధ్ర సంఘాలు నెలకొనడం ప్రబల నిదర్శనం. 1975లో హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆధ్వర్యాన ప్రథమ ప్రపంచ తెలుగు మహా సభలు వైభవోపేతంగా జరిగాయి. అంతర్జాతీయ తెలుగు సంస్థ ఏర్పడింది. దీనిని వృద్ధిపరచి ప్రపంచంలోని తెలుగు వారందరి అభ్యుదయానికి కృషి చేయడం ఆంధ్రప్రజల విధ్యుక్త ధర్మం.

ప్రపంచంలో భారత దేశానికి ఈనాడు అనేక రంగాలలో ఉన్నతమైన స్థానమున్నదంటే అది పునరుజ్జీవనోద్యమం వల్ల వచ్చినదే. మరి ఇక భారత దేశానికి రావలసినది నైతిక పునరుజ్జీవనం. దానికొక యుగపురుషుడు ఆవిర్భవించవలసి ఉన్నది.




తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషిచేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3



తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3